

శ్రీవాసుదేవాయనమః.

# నిర్వచన భగీరథోపాఖ్యానము.

శ్రీసౌందర్యపయోజలాకరవరోర్మిప్రోజ్వలంబతిరిదు । వ్యాసోముఖ్యమునీంద్రసేవితమమిత్రధ్వాంతనక్తాంతనం । భాసత్పాపమనార్యదుర్లభము శ్రీమారామదాసాత్మన । ద్ధ్యానంబైతగుచన్న కేశవ పరబ్రహ్మంబుమమ్మేలుతన్॥

సీ॥ భువనజాతములున్న బొజ్జవానివరించి భువనజాతములుగీములుగమించి । కమలాంకసహజయై గౌరవంబువహించి కమలాంకయైకశాగరిమగాంచి । ప్రద్యుమ్నడనుతనూభవుకూర్మిగనిపెంచి ప్రద్యుమ్నగృహపాళి పదవినించి । జీవనాకరమందు చెన్నుమీఱరజనించి జీవనాకరములాశ్రితులకుంచి । ధాత్రిజెల్వారులేఖ కాంతామతల్లి । తల్లితల్లియశేషాత్మదాసకల్ప । వల్లిశ్రీరామదాసుసద్భవనసీమ । నుండుగాతసరిష్టాళిజెండుగాత॥

శా॥ సామేనంగల నన్నుజూడకయె శీర్షంబెక్కియున్నావటం । చామిన్నేటినిబల్కియవ్వలికి ద్రోయంగాళికాదేవియు । గ్రామర్షంబున నర్ధచంద్రమిడి కేల్హత్తించెనాగన్ శిర । స్సీమన్ ఖండవిధుండుగ్రాలదగు మా శ్రీకంఠు సేవించెదన్॥

సీ॥ కమలోజ్వలంబైన కరతలస్థితిగాంచి ఘనసుమహావిభూతిని వహించి । చిత్రకాగ్నిశిఖోల్లసితఫాలమునమించి ఖలనిశాచరపుంజంబులగలంచి । సరసగుణకదంబసంగతివర్తించి హాలికాండవైభవంబవధరించి । రత్నాకరకలాపరమ్యాంబునెసగించి యచలశృంగారాలయతవసించి । సంతతంబుశివాభిఖ్య సంగ్రహించి । నిరుపమంబైన యభ్రవేణిని భరించి । మగనివడువున నెగడెడి నగతనూజ । భూరిసంపదలిడి మమ్ముబ్రోచుగాత॥

ఉ॥ తాసిరిలోగిటంగలిగి దైవతకోటికిమేటియైవచః। కేసరిమధ్య
కాస్యములు కేళిగృహంబులుజేసియధ్వర । గ్రాసులుమెచ్చనిక్కవుజ
గంబుసుఖంబుగనేలుచున్నభా । షానఖుడాయురున్నతులొసంగుతమా
కనిశంబుకూరిమిన్ ॥

మ॥ కవులశ్రాంతముగొల్వమించిభువనఖ్యాతిన్విడంబించియూ।
ర్జితవితానంబుధరించి కచ్ఛపిఘనశ్రీలన్బ్రవర్తించిభూ । ర్యవదాతప్రభ
లన్వహించివర శబ్దాభోగతల్ గాంచిన । చ్ఛివయాదివ్య సరస్వతీమణిర
సశ్రేణుల్ ప్రసాదించుతన్ ॥

చ॥ కరదళితాభ్రధునవ్యరువి కాసరోజుడుభక్తకుంజరో । త్కర
సురగహ్వరీజుడు జగన్నయనోజ్వలతేజుడున్నమ । త్సరసకళాజితాజుడు
రసారఘునగ్రతనూజుడున్ శ్రవో । మరుదపసారితాచల సమాజుడుమా
జుడుమమ్ముబ్రోవుతన్ ॥

సీ॥ అమితరాగప్రకర్షాభిరామైక సుగ్రీవుడైయవిత సుగ్రీవుడ
య్యె । ధీరకేసర్యంబ్జు నారమణ్యగ్రకుమారుడై సత్వకుమారుడయ్యె।
పదనఖదళితశుంభత్సు వేలాహ్వయాగారుడైన తహృదాగారుడయ్యె ।
రామాస్యపూర్ణతా రారాట్చకోరాయి తాత్ముడైదోర్నిర్జితాత్ముడయ్యె।
నెవ్వడాతండు మత్కృతాహీనకావ్య । హారఘటితామలినశబ్దవారమా
క్తి । కుండువిజ్ఞానఘుత సనకుండువాయు । పుత్రకుండు సిరులమమ్ము
బ్రోచుగాత॥

చ॥ రవిశశిభూజసౌమ్య సురరాట్సచివాసురదేశికార్కిరా। హు
వులునుగేతువున్బదునొ కండగురాసినెసంగుసౌఖ్యమీ। నవకృతియత్న
కారి కథునాతనసత్కవిరాజకల్పక । ద్రువునకురామదాసునకు రూఢి
గనిత్తురు గాతకూరిమిన్ ॥

గీ॥ మానితాద్వైతదంభ భర్మంబుదుర్మ। తాంధకారవిగోచరం
బైనభాను । మూర్తిన్నైతోచిదానినిమ్ముగవెలుంగ । గరపిచెలువొందు
శంకర గురుభజింతు॥

గీ॥ వేదములకన్నిటికి భాష్యవిరచనంబు । జేసినిజకీర్తులాశలజే

ర్చిశాస్త్రిలు । కాలమాధవయతిని నిక్కముగ గొల్తు । నిరుపమంబుగ నీకృ/తి నెగడుకొరకు॥

శా॥ తానద్వైతసరోరుహాకరము మాద్యద్దాన వాంశోదితా
ర్యానీకచ్ఛల కాసరచ్ఛటలచే నత్యాకులంబై చనం । గానచ్ఛస్థితిధీమృ
పాకతక మౌగ్రశ్రీనెసంగించెల । క్ష్మీనారాయణుడమ్మహాయతివిభుంగీర్తిం
తుఁ శ్రేయోర్థినై ॥

క॥ కొలుతు న్సద్గురువిద్యా । లలితలహర్యాశ్రిమాలి లసితవివ
శ్చి । జ్జలరుహహేళిన్ జ్ఞానక । పిలశౌరిన్ పాటిబండ పిచ్చయనూరిన్॥

శా॥ ధీమంతున్ స్మరణీకృతామితమహా దేవాభిధానుంగళా । శ్రీ
మంతున్వరమంద పాటికులజున్ శిష్యచ్ఛటాకల్పును। క్షేమునిగూపతటా
కసృష్టి పరమేష్ఠింజానకీరాముసం । ధామృత్యుంజయు మత్సఖున్ దల
తు శబ్దశ్రేణికాసిద్ధికిన్ ॥

మ॥ పరమానందసుధాసరిల్లహరికా పాణింధమాంచత్కవి। త్వా
రమాకల్పితమైథిలీశ్వర చరిత్రచ్ఛద్మస ప్తచ్ఛదాం । తరనిర్యాతయశస్సి
తాభ్రసురజః పంతాన పేటీభవ । త్సరసీజాతభవాండునాకుభవు నాత్మం
గూర్మి సేవించెదన్॥

ఉ॥ మోములునాల్గులేని బిసపుష్పభవుండుద్విబాహుడౌ రమా।
ధాముడు నేత్రయుగ్మ గిరిధన్వియనందగు బాదరాయణ । స్వామివసిష్ఠు
న ప్తనల శక్తి సుపౌత్రుబరాశరాత్మజ । గ్రామణి శ్రీశుకార్య గురుగాఢ
తపోనిధినాశ్రయించెదన్॥

మ॥ భవభూతింజయదేవు బిల్హణకవి న్బాణున్మయూరాభిదున్
శివభద్రాహ్వయు భట్టహర్షగుణ రాశిన్ గాళిదాసాఖ్యభా । రవిమా
ఘున్సుమదంతు మల్హణుని ధారానాథుదండిన్ బుధ । స్తవసుంధర్మసుధీ
మణిందలతు నాత్మంగావ్యసంసిద్ధికిన్ ॥

గీ॥ సౌరభాషనలరు భారతరామాయ । ణములు దెల్గొనర్చిన
మహితమగు । కీర్తి నటికిగొండ్లిగీములాశలు జేసి । నట్టికవులదలతు నధి
కభక్తి॥

చ॥ చదివినహాయనంబులు ప్రసంగవశంబున బల్కుటింతెపెం।
పొదవినవిద్యదెల్పరు క్రియోన్నతిబాఠముత్రైనపద్యముల్ । వదురుదుర
ర్థయుక్తముగ వాడికలేనిపిజెప్ప లేరహా। పెదవిమలంతుకార్యకృతిబృం
దముగన్గొనినీచకాకవుల్॥

ఉ॥ డగ్గరియున్ననాడగగడంగరుజచ్చినయట్లుదవ్వనం । బగ్గలు
జెప్పఃకుందురల పట్టునధీరుడుదారసిల్లినన్ । సిగ్గునబారజూచెదరి సీయ
లనీచులనుచ్చరింపన। మ్యగ్గురుభక్తిశాలికిమహాకవిమాళికిరోతగాదొకో॥

గీ॥ ఈకరణినిష్టదేవతానీకములను । వరమతాచార్యులను కళా
గురునిసఖుని । సంస్కృతకవిప్రభులనాంధ్రసత్కవులను । నుతులుగావిం
చికుకవిధిక్కృతులునలిపి॥

క॥ కృతినొక్కటి నిర్మింపన్ । మతిదలచియు నెల్లమందమారా
రిపద । ద్వితయంబుగొల్చిక్రమ్మరి । కుతుపసమయమునను గంటిగుడిపూ
డితగన్॥

గీ॥ అవనిగుడిపూడి వెంకటప్పయ్యధీరు । డంగజాకారు డతులవి
ద్యావిచారు । డామహోదారునింటికే నరుగ ప్రేమ । నెరపిబంధుప్రియ
మునమన్నించినిల్పె॥

గీ॥ నిల్పినరసాన్నమునతుష్టి నెరపినన్ను । గూర్చుకొనివెంకట
ప్పయ్యకోవిదుండు । ప్రేమభీమాన్వయుడగు శ్రీరామదాసు । నింటికే
తేరగూర్చొవహించియతడు॥

క॥ మమ్మున్నతాసనములహి । తమ్ముగగూర్చుండబెట్టిదాశరధిచ
రి । త్రమ్మాకర్ణించుచు । మోదమ్మూర్మరగనుండ కొంతదడవరిగినచోన్॥

మ॥ స్థిరకీర్తిన్ దురగాన్వయున్ సుగుణకంధిన్ దక్షిణామూర్తిన్
స । త్కరుణాలబ్ధకవిత్వనిర్మితబహుగ్రంధోత్కరున్ సండితా । భరణుం
వేంకటకవ్యధీశ్వరుమహా పల్యంకికోద్భాసితున్ । సరసున్ నన్గని పల్కె
ధూర్జటిజటా సందీప్తగంగార్భటిన్॥

ఉ॥ భారతమందు పంచదశపర్వములందెనుగించినట్టిధీ । సారుడు

దిక్కనాధ్వరి రసాస్థలి నెవ్వనిగోత్రసంభవుం । డై రహి కెక్కె గౌతమ మ
హామునిగోత్రపవిత్రుఁ డెవ్వఁడా । ధీరుఁడు వేంకటప్పయ సుధీమణి మత్సఖుఁ
డౌ ఎరుంగవే॥

చ॥ నయనిధితీర్థయాత్రలు ఘనంబుగనీగుడిపూడి వెంకట। ప్పయ
జతబాయకేమునునిజాంగనతోనొనరించినాడని । శ్చయముగనన్నియుం
గలుషసంఘహారంబులెదైనగంగయా । రయనధికంబటంద్రు సుకరంబు
గ్రవాయుమునత్కథాస్థితుల్॥

ఉ॥ నాకులజాతవీరులిటు నాకులచేరకయుండిరంచుము। న్నాకు
లుడై భగీరథుడ నాకులవృత్తి దపంబొనర్పమీ । నాకరతూణుదేవగిది
నాకధునింగొనె నెట్లుదానిదా । నాకకుదెచ్చిమానితగ నాకలిదీర్చుకొ
నెఁ వచింపుమీ॥

క॥ గుడిచెర్వుదోపుగొడుకుఁ । గడిమిద్విజస్థాపనంబు గనకము
ధరయం।దిడుటయునుకబ్బమెన్నం । బడుసంతతులనగదెరవుపస్లైదివికిఁ॥

ఉ॥ అందొకకావ్యమొప్ప నఖిలావనిలో దిరమైయటంచుము ।
న్నందరుజెప్పవింటి సుగుణాకరదాని సృజించియిందుజె । న్నెందెను నె
న్న కేశవు మహోరగశాయినిభర్త జేసియా । నందము జెంద జేయుమఘ
నాతనపండిత మానసాళికిఁ॥

క॥ అనిచీనాంబరములుమం । డనహారాశ్వములనిచ్చినం జేకొని
స । య్యననేతత్కావ్యప్రే। రణకార్యన్వయమువరుసవ్రాయగదగితిఁ॥

సీ॥ శకటకుపాటోగ్ర శార్వరారుణమూర్తిఁ హాలకులినాడిరే
ఖానువర్తిఁ కాళియఫణిఫణాగ్రవిహారతత్పరంబార్యహృద్గేహదీపాంకురం
బు । నతలేఖమకుటరత్నప్రభాకలితంబు లక్ష్మీకరోదరలాలితంబు। జటు
లారిరూప యుక్కటకాభిరామంబు భాగవతార్చనాప్రౌఢిమంబు। సత్ర
రథరాజవాహాను పడజలజము । బుట్టిరచ్చోటఖిల కులాంభోధికుంభ ।
జాతులజరాపగావరజాతులగుచు। శూద్రవిభులుయశోజితశూద్రవిభులు॥

గీ॥ అందునాలుగుతెగలుగా నతిశయిల్లె । వెలమలనకమ్మలనరె

డ్డిపీఁగులనఁగ । తెలఁగలనఁగనువీరిలో తెలఁగవారు । ప్రబలిరుర్విస్థల్గిని శివభక్తులగుచు॥

క॥ శివునకుమహానటాహ్వాయ । మవుటనుతద్భక్తులీ మహామహులై గౌరవమొందుటపదవృద్ధిఁ । దవిలిమహానాటివారనఁగ వెలసిరిలన్॥

గీ॥ తన్మహానాటిశబ్దతద్భవముగాదె । యిపుడుమహానాడననాంధ్రవిపులయందు । జెల్లెవీరికికరుబంత సింధురోరు । దంతనిభకీర్తిఁ నెసఁగిరిధరణివీరు॥

క॥ ఈతెగలోఁజనియించెన్ । శీతగిరీందూరగేశశివసీరిబలా। రాతిగజాభయశముబెం । పైతగవెంకయ్యసత్కులాకల్పంబై॥

సీ॥ దర్పనిరంకుశోద్యద్వైరిశరధికిబాడబంబెవ్వాని వేడబంబు। సమధికామలయశశ్శాల్యంకురాళికి విత్తనంబెవ్వాని పెత్తనంబు। భూమీసురులకుచింతామణీమందార రూపకంబెవ్వాని ప్రాపకంబు । నృపసభాజనరంజనీభూతకల్యాణ సూచకంబెవ్వాని వాచకంబు । భళిరయతడువిరాజిల్లెభవ్యనుకృత సారతటినీకృపీటనంతాళితాఖ। లాత్మకులపూర్వపూరుషోగ్రాఘుకర్ద । మాళిభీమాన్వయుడు వేంకయాభిధుండు॥

క॥ ఆభీమావెంకయ్యామ । హాభీమాయోధనాగ తారిజయుని సం।ధాభీమానుజునజజా । యాభీమాభయశురామయాఖ్యునిగనియెన్॥

సీ॥ వరకవిరాగఃవనమిచ్చిధాత్రినుత్కటకీర్తిఁ నిల్పినఘనుడితండు । వరమహాబలము లెప్పాటపైనడరిన దెరలనిసద్గోత్ర వరుడితండు । ధీరచక్రములకెంతేరశ్మినిడి ప్రశస్తముగన్నలోకబాంధవుడితండు। కచ్ఛపమకరశంఖము ఖనిధానాతిశయుడైన సర్వజ్ఞసఖుడితండు । భూరికళలనెసఁగుమహాభోగియాత । డనుచుదన్నఖిలార్యాళు లభినుతింప । నలరెభీమాన్వయుడురామయాభిధుండు । మిత్రహృదయాంబుజములకు మిత్రుడగుచు॥

క॥ సచ్చరితుడురామయవేం। కచ్చమ్మనుగానియెమున్న గరుడధ్వజుడా । పచ్చవిలుతుగన్నమనువి - యచ్చరతతిమెచ్చబెండ్లియయిన విధమునన్ ॥

మ॥ పతికారంభవనీవకావళుల కన్యాప్రముఖ్యోత్తమం । బ
తిథిశ్రేణుల కన్నపూర్ణస్వవయస్యా నీరజాస్యాళికం । చితయాగాశనధే
నురత్న మగుచుం జెల్వొందెనారార యీ । క్షితి వేంకచ్చమచర్యలూహిం
పలుపన్ స్త్రీమాత్రశక్యంబులే॥

క॥ వేంకచ్చమ రామయకుమ్మ్రా । గాంకాభయశుండు పుల్లయా
ఖ్యాడౌదవెని । ష్పంక యగుశచికిహారికక । లంకుండుజయంతుడుజ్వలత
బాడముగలిన్॥

సీ॥ చేయించినాడునిశ్చింతతో బెండ్లిండ్లు వడుగులు బ్రాహ్మణవ్రా
తములకు । పూయించినాడు దిక్పూర్ణేందుముఖులకు ఘనయశఃపాటీరక
ర్దమంబు । వాయించినాడు చెంపలు వ్రీల దోరగ్రములుసాచి నీచారిపుం
జములను । కోయించినాడతిక్రూరపాటచ్చర ప్రాణిచ్ఛటలనంటబట్టిజా
ట్లు । భళిగ సాధారణుండె జంభరిపుసదృశ । వైభవాఢ్యుండు భీమాన్వ
వాయజలని । ధానజైవాతృకుండుమంధానశిఖరి । ధైర్యకలితుండు పుల్ల
య్యధార్మికుండు॥

క॥ భీమాపుల్లయధీరుడు । ప్రేమన్ శ్రీకోటమాంబ ప్రియగాగా
నియెన్। రామప్రభుడామిథిలా । స్వామిసుతం గైకొనినయశం బేపారన్॥

సీ॥ విభుడుగోపించంగ వెరచుటెంతియెగాదు కనరానదేనాడు
బెనిమిటియెడ। చుట్టాలతప్పెంచుటలెరుంగమియెకాదమర ధేనువు బాంధ
వాళికెల్ల । మార్గణశ్రేణుల మనుచుటెంతియెకాదు వేమారుచనుదె
రవిసువుకొనదు । ప్రాణనాయకసుహృత్పటలి బ్రోచుటయె కాదాత్మసో
దరులయట్లాదరించు । భళిర యీనాతికుద్ది జెప్పగగలారె। సతులుముల్లో
కములునవిజనులుపొగడ । నలరెభీమాన్వయుడగుపుల్లయ్యబోటి। వా
ఙ్మదనఘోటికోటమాంబావధూటి॥

క॥ పుల్లయ్యకుకోటమకుజ । గల్లలితశ్లోకమల్లికాసుమహాలా
తల్లజయుతదిక్స్త్రీనిధ । మిల్లుండగు రామదాసు మెరసెన్ సుతుడై॥

సీ॥ గంతువై చెడి కురంగము రెండు ఖండముల్గాజిప్ప సెలనార్చు
కౌశలంబు । నాము లేనుగను గ్రావ్వార కేల్వట్టి గీ పెట్టింపజాలినభీమబల

ము। పైవిహంగముగుంటె బారుచేవడిచుక్క దెగిపడ్డగతినేయుమగతనం
బు। పొదనున్న పులినిబిట్టదలించియెదురేగి కరుకుబాకునగ్రుమ్మగడును
తనము। తనకెకలదంచుశూరబృందములుమెచ్చ। బ్రబలెభీమాన్వవా
యవారాశిపూర్ణ। శరజవిమతుండుహృద్గతనరహితుండు। దానవిజితఘ
నుడురామదాసఘనుడు॥

సీ॥ వసుధశల్యములెన్ని వ్రాల్చుకున్నదధీచి నిదానమునకె
ట్లుజెప్పవచ్చు। స్థాణువుదలద్రీల దానెంతకొట్టిన పార్థుడెట్లగుబలప్రథకు
దీటు। భంగనంహాతిపెన్గ బడియెట్లొరలిపశరధివచ్చునేగ భీరతకుసాటి।
చుక్కవాలనకమిన్నెక్కినిక్కినిశాధవు డెట్లుకీర్తికిసవతువచ్చు। నను
చువిద్వత్కవిశ్రేణులభినుతింప। నలరెభీమాభిజనమహోద్యానపారిజా
తుడనవరతా పారిజాతుడర్థి। దైన్యహాననుండు శ్రీరామదాసఘనుడు॥

గీ॥ శ్రీమహాలక్ష్మమనుమున్పరిగ్రహించి। పిదపహనుమాయమాం
బను బెండ్లియాడి। ప్రథితసౌఖ్యనిరంతరోద్భాసియగుచు। తేజరిలెరా
మదాసుపృథ్వీతలమున॥

సీ॥ అవిముక్తముఖ్యపుణ్యక్షేత్రములు ప్రాణవిభుతోడ గూడిసే
వించెగూర్మి। నఖిలపురాణేతిహాసంబులసనాథయై పండితాళిచేనాల
కించె। సరసవిశ్రాణనచ్ఛలపయోదామృత శ్రీలవనీపనీపాళిమనిచె। న
విరతాభీష్టమృష్టాన్నంబుల నొసంగికలచుట్టములనెల్లగారవించె। నౌర
యీయమ్మజేజేలయూరు పీడి నెలతయైకాలుచింతామణియెయటంచు।
తజ్ఞులెన్న నెగడె రామదాసుహృజ్జలరుహారోలంబశ్రీమహాలక్ష్మమాంబ॥

ఉ॥ శారదవాక్యసంపదకు సత్యవరాకృతి కార్యశత్రుసం। హా
రపటిష్ఠతావిధిక యవ్యవహారతకబ్జగేహవి। స్ఫారపతివ్రతోన్నతికి వా
ర్ధిపటాత్మజయీవికాసుర। క్ష్మారుహశాఖయారహనుమాయమ నెన్న
వశంబెయెరికిన్॥

గీ॥ రామదాసధీర రత్నంబునకుకుమా। రకుడుకోటయాఖ్యుడ
కలుషుండు। ప్రబలెహీరహారపారదడిండీర। సదృశకీర్తియగుచుజగతి
యందు॥

క॥ ఈకోటయ్యకులాంగన । పాకారిసతీసమాన ప్రబలారమణా
మాం॥ బాకాంతమార్గణులకును । హాకల్పకవల్లినాగనార్యులు మెచ్చన్॥

గీ॥ ధాత్రిహనుమాయమకు రామదాసునకును । గలిగిరి కుమా
రవరులు వేంకయసమాహ్వ । యుండుమరియు మార్కండేయుండు భయ
వంశ । పావనుడగుకు చేలుడు భవ్యగుణుడు॥

సీ॥ తండ్రియా శ్రీరామదాసుగంగాస్నాన సుకృతఫలంబువిస్ఫు
రణమగుచు । సర్వంసహాసుర సముదాయభావు కాశీర్వచనాళిప్రసిద్ధ
మగుచు । నిలవేలుపులకృపావిలసనంబులు సముద్దామప్రభావకందంబు
లగుచు । ప్రాంచితైకాదశస్థానచరన్నవగ్రహ దృష్టివతతంబు కరమొసగు
చు । వేంకయాఖ్యమార్కండేయువిశదమూర్తి । యగుకుచేలుని ప్రో
చుతనవనియందు । పార్వతీపరమేశ్వరుల్ భార్గవీవి । భులును బ్రహ్మాదిభు
లుగాతురలఘుకరుణ॥

సీ॥ పాలమున్నీటిలోపలితోలుంకులమీద చెలువరాపాన్పుపైజ
లజనయను । డెందాకనసియించు నందాకభీమాన్వవాయ పాథోరాశి
పర్వచంద్రు । డగురామదాసు కీర్త్యంగనామణితోడ నతనివంగడపునా
రందరుందు । రలచెన్నకేశవునలఘుదయారసంబున నీప్రబంధంబు భూత
లమున । నార్యవర్ణితమైధాత్రినలరుగాత । రాజతాపనుడగు భగీరథు
నిచర్యలాలకించినవారికినజరవాహి । నీజలస్నానపుణ్యంబు నెగడుగాత॥
ప్రళయాబ్ధినిర్మగ్నభయమూడ్చితనలో జగమునమార్కండేయు గాచెనె
వ్వ । డనికిడాకొనినయుగ్గునునకువిశ్వరూప శ్రీనిజూపినవరుడెవండు। సుం
దరాజలిగబిట్టుగు దియించురావాన కచలమెత్తినవిర్మలాగ్నుడెవడు । నత్స
గోపార్భకానకలిగొన్నధాతకు మహిమజూపినభక్తమాన్యుడెవడు । ప్రీ
తులబుట్టినదైతేయాపతులజంపి । తత్తరసమునవెవడుగోత్రనానగించె నతి
డుశ్రీచెన్నకేశవుడామహాను । భావుడలచినవిష్టార్థఫలములరుదే॥

క॥ ఏవంవిధచర్యునకున్ । సేవితసురవర్యునకు వసితసూర్యు
కున్ । పావనకార్యునకజర । గ్రావశ్రీధైర్యునకు జగద్ధుర్యునకున్ ॥౧॥
సరసిజభవాండకోటర । భరితయశశ్శమితశశ్యపర్యంకునకున్ ॥

ధీరఖేయము లరేఁ గన్పట్టెదన్నధ్వగో । త్రనుజక్రాగము భంగిసాలమునీ
ఖాగ్రస్ఫుగ్రీవథాత్రిండమై॥

మ॥ రవళించుం బురిపై జయానకము వా ప్రాసాదసద్గోపురా గ్ర
వసత్కృత్రిమమూర్తిఁ హాస్సిరిపురీ ఖాదర్శనోద్యత్సము। ద్ధనహ్మాన్మత్స
రరాశిమధ్యగతమా తంగాదిదుర్వారభై । రవఃస్హాదమిపాభధన్యరు
ఝుకీరంగత్తరంగార్భటుల్॥

ఉ॥ రావెఘృతాచి రంభ బుధరంజని హేమ కుమారిభూరిహా ।
ర్ద్యావధినీవిధిన్నిలుచు టుంద మెదిన్యశరీరశూరయ । జ్యావళిడాసెనింద్రవ
భకాటకుబోదరియయ్యె నంచునా । ప్రావనిభృత్యుకచాళియను నక్కడి
కాంచనపుత్రికాతతిఁ॥

సీ॥ కలశార్ణవోర్మికా వళులంచుజలశాయి యోగనిద్రాసక్తి
కుత్సహింప । మగనిచేసెలవంది నగజాతతనవుటనిల్లీడయుని ప్రేమనేగుదే
ర । కలధౌతగిరిశృంగములుగాదలచి విహారమునల్ప మేదనీరధుడుడాయ।
బృహదభ్రనిమ్నగాలహరులంచని జహ్నుడనుమానివిస్మితాస్యుడగుచు
జేర । నలరెనచితవేధోండతలనుమైన । పృథుతరోత్సేధ సౌధవర్ధిత
హీర । మాడలమయూఖరేఖాసమగ్రరుచిర ॥ శుచిరుచిప్రచయంబుల
చ్చోటబలసె॥

ఉ॥ సారఫలచ్ఛదోన్నర నిశాంతములం ద్విజపాళి కెల్లన । త్కా
రమొసంగి ధీరసమాకాంత దుల్వనిబొల్చునందు [illegible] । సారఫలచ్ఛదోన్న
రనిశా [illegible] లం ద్విజపాళి కెల్ల । సత్కారమొసంగి ధీరసమాకాంతదుల్వని
బొల్చు [illegible]॥

[illegible] లఘుశౌరీవాదమైన యంగగు [illegible] రుని చేతనోడెను। న్న
లచ [illegible] క్షెట్టి చతురాస్య కరిష్టను లిచ్చు దాజగ । త్తులకు [illegible] వదర్శ
నంబు [illegible] ఘు డత డెట్టి బుధుండటంచుని । చ్చలువిహాసించుచుం [illegible] సుర
సా [illegible] ఘు నుని త్పురంబునన్॥

మ॥ మతివిద్యాజితజీవశేషులగుచున్ మాన్యవైల్తురే కానిదు। ర్గతి
గాకెన్నడు జీవశేషులురు శౌర్యశ్లోకరేఖాప్రథా । న్నతిథికార్యపిరాజ

మానీలగుచ్ఛ వర్తింతు రేకానివం । తతముగ్గారవిరాజమానులు బురాంతర్యానరాజాగ్రణుల్॥

ఉ॥ శ్రీకరవైచెలంగు నిజజీవనమెన్నడుగోలుపోదుదో । పాకరు రాకకుబ్బరిడ రన్యులకెత్తరిచేదుభూమిభృ । న్నైష్ఠికముముంచ రప్పాలవహించరు భంగకదంబకంబుర । త్నాకరులయ్యుజిత్రమున నప్పరినుండు వణిక్శిఖామణుల్॥

ఉ॥ కోరిననీరరాశిగలకోడెను వేలుపులొక్కగోపతిఁ । ధీరత నీడెయాపశుపతింగని వేడినరెంటిగట్టదో । శ్శీరముముచ్చికున్ని ఫలసిద్ధివహింవక రాముడూరునే । రూరకవర్తియ్యజాగ్గొనుట యొప్పనెయందురుశూద్రులప్పదిఁ॥

చ॥ రవిరథరథ్యరశ్మిఫణి రాజిమృణాలములంచుహంసము । ల్దివికెగనెత్తుశైలవిత తిండిలకించిప్రతీభశంకచే । దవిరళదన్తులందొలుపుదారుణ ఘీంకృతులందిశావశా । ధనవమితింగలంచుమదదంతి కదంబకమప్పురంబునన్॥

సీ॥ ధారాధరములయ్యు ధాత్రిజరించుచెత్తరినిమిత్రావరోధము వలుపవు । కాండంబులయ్యు నిక్కముగనిజారోహ శుస్తంబునభివృద్ధిజొన్పుచుండు । హంసంబులయ్యుదా మనిశంబుమానస పాత్రిక్రమాత్రీలచేదిపురుచుండు । గంధర్వతతులయ్యు గడువిమానంబువహింపనిధాటిచే బెంపుజెందు । దిరుగడుపరదుగాఁధఃప్రదేశమెనసి । హరికులంబయ్యుననిబుధులరిదినొంద । తేజరిల్లెనారట్టకాంభోజయువన । సింధుజములైనవప్పరీసైంధవములు॥

క॥ సగరుడువిక్రమనిజిఁత । సగరుడునిజదోర్గ్నరస్తసాహానవిఖ్యాణా । సగరుడుసత్వరమోల్లా । సగరుడుదానగరిబెంపె సగబాలించుఁ॥

సీ॥ తనకీర్తినటికిను తమరసజ్ఞాంత రంగములు విఖ్యాతరంగములుగాగ । తనశౌర్యరవికమిత్రచ్ఛటామద వికారములు ఘోరాంధతారములుగాగ। తననిర్వపణకల్యమునకుమారేంద్ర చక్రములనారతముచ

క్రములుగాఁగ । తనకళాకాసారమునకు నిర్మలభావ కవులునిర్మలభావక
వులుగాక । బరఁగెనిజమృదు పదయుగభరితశరధి । పరిధిగతవిశ్వధరణీ
విభాసిరాజ । శేఖరశిరోగ్రమకుట నిచితబహూరు । తరమణివిభుండుస
గరగోత్రావిభుండు॥

క॥ అతనికిఁగలారుదంచిత । మతులుసతులు గేశినీసుమతులిర్వురు
స । న్నుతచతురాలాపసర । స్వతులుగళావసతులనఘచరితజితసతుల్॥

క॥ క్రూరకృపాణోరువిభా । భారోద్గాఢాంధకారపటలాంధీభూ
తారియయిసార్వభౌముం । డైరనబాలంచెసగరుడార్యులుపొగడన్॥

సీ॥ గండముల్లైలాంతికప్రదేశములందు దుష్కీర్తిపల్వలస్తోమ
మందు । గాఢవిసారముల్గాసారతతులందు మధుపపంక్తులను సుమంబు
లందు । కఠినంబుకలకంఠ కంఠకుచములందు లేమిలేములమధ్య సీమలం
దు । పల్లవోల్లాసంబు పాదపావళులందు యతిభంగములుకు కావ్యంబు
లందు । కుటిలవర్తనసతులముంగురులయందు । చంచలత కామినీదృగం
చలములందు । గానికానంగ రావుసగరమహీవిభుండు దాఁజక్రవర్తియై
యుండునాడు॥

ఉ॥ హైహయతాళజంఘముఖరాహితరాహుతపర్వతాంబుము
గ్వాహకుడైనయాసగరపార్థివుకీర్తివధూటివిశ్వసృ । డ్గేహినినవ్విసా
రకరిరాట్ప్రవరుంగనికాలుద్రవ్విన్వ । ర్వాహినిగ్రోవ్వజివ్వికడు రాజిలె
సర్వదిగంతవీధులన్॥

గీ॥ ఇటులనారాజమౌళిసర్వోలనేలు । తఱిఁగడిచెకొంతయంతనా
ధరణికాంతు । కాంతలనపత్యలైయున్నఁగనివిషాద । సహితుడైపల్కెన
తదాత్మసతులఁజూచి॥

సీ॥ పుత్రునెత్తనిమహా భోగంబురోగంబు సూనుండుదవ్వులనిమే
నుప్రమాను । తనయుండు మెలఁగుచుండనిగీము బెనుతూముశిశువ్రుపల్కుడ
గన్నచెవ్పులుగవులు । ప్రియసూతిగనక శోభిలుకన్నువలకన్ను తనుజు
ముద్దిడనియాననముపెనము। పట్టికిచనువీని భావంబుదావంబు నందనుం

డొందవునినాతిక్రోతి । వసుధనిర్మాణవశుఁడైన వానినోపటి । వ్రాతిరోతగ
దాకీరవాణులారా । కావునసుతార్థినైన నన్నావనేద్ది । గలదుపున్నామ
నరకసంగతికిబాపి॥

చ॥ అనవుడువారలిట్లని రహస్కర తేజపితౄణభారమే । య
నువునబాపవచ్చు తనయాగ్రణిగల్గకయున్నవంశపా । వనుడగునందనుం
డనెడి పండుజనింపని సంస్కృతిచ్ఛలా । వనిజమహానిరర్ధకవిభావిభవం
బువహింపదేభువిన్॥

క॥ కావునసంతానార్థుల। మైవనితపమాచరింతమనిపల్కినా ॥
భూవల్లభుండుమంత్రిజ । నావళిరావించియనియె ననఘుతరోక్తిన్॥

ఉ॥ సంతతిగోరిఘోర వనసంతతిలోనొకచోదపంబుని । శ్చింతు
లమైయొనర్తుమువచింతు వినుండికమేమువచ్చుప । ర్యంతముదన్వదంత
మహీయంతయునేలుడి దుర్మదారివీ । రాంతకచర్యయున్ బుధ జనావన
ధుర్యతలాచరింపుచున్॥

శా॥ దేవబ్రాహ్మణవృత్తులంగరము నంధింపంగరాదుజ్వల । ద్గ్రా
వాగ్బైయదివంశగహ స్థానంబులంబాకిభ । స్మావాలంబులొనర్చునాయు
వయునుద్యద్ధీయునార్జించునో । త్రావృత్రాహితులిట్టికర్గము లొనర్చం
బోవరెప్పట్టునన్॥

చ॥ కటికితనంబుగల్గు నధికారులగూరుపరాదువారలా । కృట
నరిమెండుజేసిభువికాపుల లేవగదోలితద్గ్రుహా । త్కటతర దాసువేషుల
గట్టిగబాకపుగట్టుతొానటం । చటమటసేయనయ్యఘుము లక్కటభూవి
భునాకృమింపవే॥

క॥ మహివిభుడఖిలాంగంబుల । నహరహమరయమిఘటించునస
హిభయమనారా । యహిభయముకంటెలయన । స్తహమోగ్రతొకండు
బెట్టిదంబైయడరున్॥

గీ॥ అలఘుమంత్రపరిజ్ఞానియగునరేంద్రు । డహిభయోద్రేకమ
డచిజెన్నారుచుండు । నలఘుమంత్రపరిజ్ఞాని యగునరేంద్రు । డహిభ

ఘోద్రేకమడచిరెన్నారినట్లు॥

చ॥ పరుషరుషన్ నరుంగెడపి వైచినవాడు నృపాలకింకరో । త్కరముల చేతజిక్కి యధికారిపురస్థలి దీనుడై గడుం । శరణనిగోడు నల్పను రిచావునకుందొలగించెనేని యు । ల్లరికొనసాగదేసుజనులన్ననిత్తు రెధాత్రిటక్కరుల్॥

గీ॥ బందిగాండ్రుకుణ్ణ్యద్గుహావనములునిక్క । పట్టుగానుండినృపుని చేపట్టువడక । యున్న నమ్మించి కడతేర్పనుర్వరాధి । పతికఘము సెందదందురు పరమమునులు॥

ఉ॥ కారదొలంగిబారినను కత్తెరకాని తెలారమూకబి । ట్టారసిపట్టజాలక ననంతికదేశికునొక్కనిం దదా । గారము సేర్చినట్టివనిగాంచి విచారణ జేసిచారశి। ఘారచనంబునల్పనిరసావిభుడొందడె నారకవ్యధల్॥

చ॥ కనుడఖిలంబురోయ కొకకార్యము జేసిన రేడొకంటుజూ । తెనసినరోతనాతిగని యీచెలినెవ్వడుగూడెనంచుమం । త్రినడుగవాని దేనిజపురిం జరలాడుచుదూపురాసిసీ । టనుపొడిసున్న ముందదుపుటక్కరిబట్టడెనిక్లైరుంగనో॥

గీ॥ ఆనుచురాజ్ఞోతులతడు బెక్కడిరాజ్య । భరము శేషంబుమంత్రి శేఖరులమీద । నిలిపిపత్నీయుగంబుతో నిలయసీమ। వెడలె శుభనివ్వనములతో ద్విజులునడువ॥

గీ॥ వెడలివనులుధునులు వీళ్లుబోళ్లురయాన । గడచితుహినగిరినికటకకఠోర । గహనసీమజొచ్చెఘనమృగారవహాళా । హాళికిగలుగునతులయళుకుదీర్చి॥

స్రగ్ధర॥ సగరుండక్కానసేలంజనిచని కనియెన్ జాతినిర్వైరభావ్వ । న్మృగధామన్ శాస్త్రచర్చా మృదులవచనయుక్త్రీజతుష్టారభూమిన్ । జగదంచత్త్వైకసామన్ శరదధగతాసారవైతానబర్హి । ర్వ్యాగళద్ధూమన్ । దపోసంవృతయమినిరతప్రేమకర్మింది సీమన్

క॥ కాంచిపరిగ్రహాయుగళస । మంచితుఁడై చొచ్చి మునులకానతులిడిని । ర్వంచితమతినలరుఁనదీ । ట్కాంచీవిభుజూచియనిరి కర్మందిజనుల్॥

మ॥ పులులుంబొబ్బమెకంబులుంగలభనుల్ బోత్రుల్సివంగుల్ వృకం । బులుఘూకంబులు జంటనాల్గడుగులం బొల్పారుజీవుల్ రొదల్గలిగింపంగలగుండుగన్నగహ నక్ష్మామండలంబారకాం । తలతోఁ జొచ్చితివచ్చితీడకు నిమిత్తంబేమొకోరాణ్మణీ॥

క॥ అనియుచితసపర్యావ । ర్తనములునలుపంగనప్పతంగాన్వయపావనుడఖిలమునిజనంబుల । గనిమ్రొక్కివచించెవినయగౌరవఫణితిన్॥

క॥ సంతానార్థులమైబుధ । సంతానులమిమ్ముజూడ జనుదెంచితిమా । వంతననుంగునిలిపిమా । వంతందొలగింపమీరె ధారకులుగదా।

సీ॥ కావుకావనువేళ గనిముద్దుసేయుట కూర్చుండుదరినెత్తికొని మురియుట । పారాడునాడుగొప్పగగారవించుట నిలుచుపట్టునచాలనెత్తికొనుట । యడుగుబెట్టగసేర్చునదననింపూనుట భాషాభ్యసనమందు పల్లవిలుట । గజ్జలందెలుమ్రోయ గారాగనలరుట విద్యలార్జించుచోఁ బేర్మిబడుట । గలుగునిసువులెసంగిన ఘనులకవని । నట్టివారిభవములు పుణ్యవిభవములు । గాననపత్యభోగముల్గానగత । రాజచంద్రికలోమాని రాజులార॥

గీ॥ అనవుడువసుంధరేంద్రునకనిరిమునులు । భృగుమునీంద్రుండుదావకాభీష్టదాయి । యగునతనిగూర్చి జపియించుమనినతద్వి । ధానమెరిగితపస్సుద్యమతదాల్చె॥

క॥ ధరణీభృద్విభుడునిజాంతరభాస్వద్భృగుడగుచు బాదలనిచ్చలుడై । ధరణీభృద్విభుడునిజాం । తరభాస్వద్భృగుడగుచు బాదలుబరించె॥

క॥ అత్తరిమిత్రకులాధిప । చిత్తరులంగాంచిమాని పికవాణులు

యో । పిత్తతులుదులకు రారుజ । గత్తలమున వీరికని పొగడిరి పగిద్దిన్॥

ఉ॥ ఒక్కెడ దెల్లబోకకతినోద్ధతిఁజూపక వాగువంకలం । జిక్కక గోళవైఖరిని జెందక మూలలనీగకున్న వా । ర్యక్కులసీల శైవల సమూహమిళిందదృఢాంధకారముల్ । జక్కని వీరి వాల్గురుల జాయలకుంబురుడింపగానగున్॥

సీ॥ లావణ్యవారాశిలహరిలోనుండి నిక్కి వెలుంగు వెన్నెలగీము మోము । రామేయమోహనా రామసీమోద్భాసి హేమమైనిరతమింపై కుక్కముక్కు । భాసిల్లురతిసుమాంబకుబులోకము గెల్చు మతిఠెక్కెములుదీర్చుమాట్కిచూట్కి । శ్రీశష్కులికనవశ్రీలనోడించు చొప్పునశుభాకారములు వీనువీను । లలఘు రేవటరాజ మంగళముగళము । ప్రసవనాళీకకరధనూరమలుబామలు । భవ్యమకరందసారంపుబావిమోవి । భళిరవీరలగోనియాడ బ్రహ్మవశమె॥

గీ॥ సరసమైనమహాగంధ శాదమందు । మునుగుటయుభూరికంకణములువహించు । టయునువివరింపగానీమిటారులకర । శాఖలుబిసంబులనుటకుసందియంబె॥

గీ॥ అరులసరిదంతరంబుల కనిచి శాత । కుంభకుంభంబులనుమహోగ్నులగలంచి । గిరులగదలంగనీకాగివరలె భళిర । వీరికుచయుగ్మములుశుభాకారపటిమ॥

శా॥ నూగారాశుగభోజిగానలసుధాంధోమార్గమాజహ్నుపు । త్రీగాథోర్మ్యలగున్వళుల్ సుడిమెబో శ్రీనాభిచక్రంబుతో । దూగున్భారినితంబదేశమనటిన్ దూలించునూరుల్సరా । త్రైగోత్రాధిప వల్లభీయుగళికా హాజంఘలొప్పారెడిన్॥

గీ॥ చక్కదనమనుకొలనిలో నుక్కమీరు । చున్న తాబేళ్లదమ్ములైవన్నెగాంచె । వీరిమీగాళులడుగులయారె వేరు! గలదెకరపదనఖపాళికలకుడులకు॥

కం॥ అనితమువణించెడిముని । వనితలతో జనువుమెరసి వారి

రువృతుబా । యనికూర్మింబరిచర్యలు । దనరుపనారాజొనర్చె దపము
గ్రముగన్॥

సీ॥ చటులనిదాఘవా సరపరంపర సమగ్రముగపంచాగ్ని వ్యాంత
రాళసీమ । భయదవార్షికఘనశ్రీపటలంబులందు దుర్భర [illegible]
త్రాతలమున । నలఘుదుర్వారశీతాహస్సమితికంఠదఘ్న [illegible]
లలోన । వాసంబుచేయుచు మాసర్వ్యయన [illegible]
నశనవిధి । క్రమముగాదాల్చి వల్కభాజితనుడు । [illegible]
భాస్వజ్జటాప్ర । దేశుడైనిస్తరశహ్యాత్య్ర శేశయుండు । [illegible]
చుండెసూరాన్వయుండు॥

శా॥ ఈమాడ్కిందపమాచరింపభృగు మాసీంద్రుండు [illegible]
నుకం । పామూంచన్నయనాంచలుండగుచు నవ్యాగ్నిచ్ఛ [illegible] ।
స్వామిగ్రామణిచెంగటన్నిలిచె నీశానుండుదాదొల్లి సు । [illegible]
వదదగ్రదేశమున నాస్థంగ్రాలుచందంబునన్।

క॥ ఈతెరగునబ్రత్యక్షుం । బైతాపసమాళిభృగు [illegible]
డాగో । త్రాతోయదవాహుంగని । చేతోమోదం [illegible]
దూర్తిన్

ఉ॥ ఏలికమిన్నతావక హృదీప్సితముల్ ఫలితంబులై చనుం। [illegible]
లికనీతపంబుపరుష క్రియజూపకుమీతదగ్నికిం । దూలికలయ్యె [illegible]
లనుజ్ఞనొసంగితి లెమ్మటంచుభా । మాలికులీనుప్రైజలి [illegible]
కమండలూదముల్॥

క॥ అవనీశ్వరుశీర్షముపై । కవిగురుడు కమండలూదకంబులు
ల్కన్ । దవిలినతపశ్రీమమువిడి । పావబాసినవీతిమానేంద్రు [illegible]
లింగెన్॥

క॥ రాజన్యుడుభృగుపాదన । రోజన్యస్తోజ్జ్వలచ్ఛిరోదేశుండై ।
సౌజన్యంబునవతియిడ । భ్రాజన్యాయుడలమాని రాజిల్లనియెన్॥

మ॥ పరితుష్టాత్ముఁడనైతినోసగరభూపా నీతపశ్శ్రీకిబల్యుర్వరసత్పుత్రులవిక్రమాఢ్యులభవల్లోలాత్ములందొక్కఁసుం । దరిగాంచుంగులదీపకుం గఠినచేత స్సారుగాంచున్ భవ । త్తరుణీరత్నమొకర్తెయన్న నృపకాంతల్మ్రొక్కి పర్ణాశితోన్॥

ఉ॥ తారువచించిరిట్లుగుణ ధన్యవదాన్యవతంసవిక్రమో । దారులబల్యురన్సుతుల దాగను నేతరలాక్షివంశవి । స్తారకుడేకళావతికె సంగునిజంబెరిగింపుడన్నన । వ్వారిజసంభవాత్మజుడు వారిగనుంగొనిపల్కె నాదృతిన్॥

క॥ మీరేగతిగోరుదురో । యారీతింబుత్రులుదయమగుదురన నయో । ధ్యారాజాగ్రమహిషిమధు । ధారాధారోక్తిననియె ధాత్రాత్మజుతోన్॥

చ॥ ఘనగుణవంశదీపకులు గానికుమారకులెందరేలన । త్తనయుడొకండెజాలు ఫలితంబుగజేయునునాదుకోర్కెనా । వినినృపదార రెండవది వేగ వచించెమునీంద్రబుత్రునో । క్కనిగనుటెంత పెద్దయొన గంగదెనాకమితాత్మజన్ములన్॥

చ॥ అనవుడువారికాకరణి నాయతిరాజువరంబులిచ్చియో। య్యనృపుతో వచించె భవదగ్రకులాంగనకొక్కపుత్రకుం । డునుదరువాత దానికి తనూభవులర్వదివేలుశౌర్యవ । ర్ధనులుదయింత్రుతద్విధము తజ్ఞనుతా యెరిగింతువిన్మికన్॥

చ॥ క్రమముగనగ్రభామిని కొకండునురెండవదానికొక్కతుం । బముప్రభవించుదత్ఫలమువ్రస్సియు షష్టిసహస్రబీజసం । ఘములిలదేజరిల్లునవిగ్రచ్చరనాజ్యఘటంబులందునె । య్యమెసగనిల్పగాగొమరులై వెలుగొందుదురర్కవంశజా॥

క॥ అనిమౌనిపల్కివీడ్కొ । ల్పినసాకేతంబుజేరివిశ్వధరిత్రిన్ । దనదక్షిణదోరంతర । మునసిడిపాలించెరాజపుంగవుడర్థిన్॥

క॥ ప్రియలిర్వురితో నిజపురి । కయనయవిధిసార్వభౌము డరు

దెంచినసుఖా । శ్రీయుడయ్యెననినసూతుఁ । నియములడిగి రవలికథమ
నీషోత్సుకులై॥

మ॥ నతహృత్కంజవిహారహారసుర కాండగ్రావరాజేందుభా ।
సితకీర్తిద్యుతిసారసారహత దుశ్శీలాదితేయానుహృ । చ్ఛ్రితఘోరాంగ
కవారవారణపిప త్సర్వంసహాభృత్ప్రియం । డితదుర్వారశ తారతారగు
డిపూడిగ్రామవాసాచ్యుతా॥

క॥ మధురాక్షసాహితసుధా । మధురాలవనాభిదామమదనజన
కసా । మధురీణజనవినుతనల । మధురాజరతీశరూప మంచదహీశ॥

తోటకము॥ సదయాసదయాత్మకసాధుమన । స్సదనాకదనాగత
శత్రుజయ। ప్రదరావిదురాదికవర్ణితపా। రదనారదనాగపరమ్యయశా॥

గద్య॥ ఇది శ్రీమద్దక్షిణామూర్త్యష్ట మూర్తిదాక్షిణ్యానులబ్ధ
కవితాసార శౌనకగోత్రా రామపటీరసుభద్రాంబికా
పిచ్చయామాత్య కుమారతురగాన్వయ పయ
స్సాగరాభోగ తారాజార వేంకట కవిధీర
ప్రణీతంబైన నిర్వచన భగీరథోపాఖ్యా
నంబను మహాప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము.





## నిర్వచన భగీరథోపాఖ్యానము.

### ద్వితీయాశ్వాసము.

శ్రీమద్భీమాన్వయతిమి । ధామవదాన్యాగ్రరామదాసవరదవ । ద్యామహిళాధిపనుతస । ర్వామరగుడిపూడిహరిదయాంబుధిలహరీ॥

గీ॥ అవధరింపుముశౌనకాద్యఖిలసూరి । కాంతులనుగాంచిపల్కె నక్కథకమౌళి । సంతతికినేగిక్రమ్మరసదనమునకు । సగరుడరుదెంచిరాజ్యంబునలుపునపుడు॥

క॥ దాహ్ర్యదరమసగరవరా । రోహాలుధరియించి రసితరుచులు గుచాగ్రా । రోహములయ్యెఁ బాధో । వాహములపరంజగట్లపైకిడిగు గతిఁ॥

ఉ॥ చిట్టుములుద్భవించెనిరుజెక్కులకుం దెలుపగ్గలించెవే । మట్టిరుచించెనాలుకకు మధ్యమసీమసమృద్ధిగాంచెనీ । ర్వట్టుశరీరమంతట విభావిభవంబువహించెనారుదా । రెట్టిగమేచకచ్ఛవిభరించె నిలాపతినాతిదోయికిఁ॥

సీ॥ కళుకువజ్రాలకమ్మల తళుకులనజెక్కుగవసార తరగౌరకాంతులూర । తరళకీలితసీల వరనీలరుచిబారె నాకుచాంచలసీమనల్పుభ్రామ । నాపన్నసత్వదంభావాతదినసరి ద్భంగోత్కరముజాయవళులుమాయ । నెదనుండబనిలేక మదనుండరుగబైటనుంచు ముల్కులలీలనుబ్రిగ్గాల । చుచులుజెన్నారనూగారు రుచులమీర । శాంతినిండారగమనంబునల్లవార । వరుసనవమాసములునిండెవార్ధిమేఖ । లాసుధాభోజిరాజకళావతులకు॥

చ॥ ఫలదములైగ్రహంబులు నభంబునమంగళరాసులందుశో । లశుభవేళహేళికుల వృద్ధికరుంగొమరుఁసుకేశినీ । జలరుహగంధి

గాంభీరగడచంద్రముఖీమణికుద్భవించెన । వ్యాలసారకాయబీజసమవాయ సహాయముసాధ్వపాయమై॥

ఉ॥ ఆసారకాయవిచ్చి విరియంబడనర్వదివేలవిత్తనా । లోవరిలేఱధరిత్రిఘృత యుక్తఘటంబుల హానిసన్నిటిఁ । వాసిగనిల్పగానవయవచ్ఛటలేర్పడిశాజకాళిరై । భాసిలెసార్వభౌముడును బంధుజనంబులుసంతసింపఁగ॥

గీ॥ జాతకర్మాదిసంస్కృతుల్సల్పి మొదటి । పట్టికసమంజసాభిఖ్య బెట్టికడమ । కొడుకులకు వేరు వేరుగా నిడగజేసె । నామకరణంబులాధరానాయకుండు॥

సీ॥ పొరలనేర్చిరిరిపూత్కరమ న సాంబుజాంతర దేశములభీతి బొరలుచుండ । బారాడనేర్చిరి ప్రమదంబు బంధుహృత్క్రీడంబులందు బారాడుచుండ । నిలిచియుండగనేర్చి రలఘుమోదంబుదాదుల డెందములజాలనిలిచియుండ । నడిచిపోనేర్చిరెన్నగ పన్నగస్వామిపడగలనన్నింటినడచితూగ । పలుకనేర్చిరి కపురంపుపలుకులొల్క । నాడనేర్చిరిదిక్కులల్లాడుచుండ । సగరసర్వంసహాతలేశ్వరుడుగన్న । తనయులకు బాల్యవైభవమొనయునాడు॥

చ॥ కులగురుడావసిష్ఠముని కుంజరునాజ్ఞ నిజప్రియాత్మజా । ళులకొగిచౌలముల్ వడుగులుంబొరయించి యనంతరంబవి । ద్యలుగ్రహింపవారికి మహాత్ములనొజ్జలబెక్కుమందిరా । ట్టిలకుడమర్చినిల్పెన్నృపతిప్రమదల్ ప్రమదాబ్ధిదేలఁగ॥

సీ॥ బహుభాషలార్జించి బలులిపుల్ శోధించి నీతిశాస్త్రంబులన్నియునునేర్చి । శ్రుతులభ్యసించి విశృతధనుర్వేదముల్దెలిసి పురాణపాళికలెరింగి। యితిహాసముల్కథల్మతినాకళించి శాస్త్రంబులాందోళించి సాములెల్ల । ఖురళికాంతరములగరచిస న్మణిమంత్రముల తెరంగారసియలఘుహరుల । నరదములనేనుగులమీది కురుకువిధము । బడసిఖేటాసితోమరప్రాసకుంత । ముద్గరగదాదికౌశలంబులమెలంగి । రలవబలసాగరులు సాగరులుక్రమమున ॥

ఉ॥ కోకపయోధరన్ కుటిలకుంతలనుత్పలలోచనన్ ధరి । త్రీక
టినబ్జకంధర సరిత్పృథులోర్మివళిన్ సుధాధరన్ । గేకయరాజనందిని సు
కీర్తినినయ్యసమంజసుండు శౌ । ర్యాకరుడాడెపెండ్లినుహృదగ్రగణులార్యు
లుబంధులౌనన్ ॥

ఉ॥ ఆతనికంశుమంతుడను సద్భుతచర్యుడుగల్గెనర్యసీ । కాంతి
భయంకరుండు పరుషాంశునిరాసితపంకజాతుడు । ద్యోతితకీర్తిమందరహి
తుండురు పుణ్యజనావనుండు స । ద్వ్రాతవికాసకారి వసుధావలయప్రవి
హారహారియై ॥

క॥ చాలన్నాలిమితోసగ । రేలానాయకుడు గేళినిందుముఖిక
డున్ । లాలింపనంశుమంతుడు బాళింజేకొనియొగళలపాళిం ధాత్రిన్ ॥

గీ॥ తగినసంబంధములుదెచ్చి తనయసమితి । కెల్లనుద్వాహము
లుమహీవల్లభుండు । జేసెనసమంజసుడుదుష్టచిత్తుడాతతాయి । యగు
చుగలచెనయోధ్యాపురంబు ॥

సీ॥ ఊరివీధులనాడుపౌరార్భకులబట్టి సరయూసరిద్ఘోరిసమితిపై
చు । స్నానంబుజేయువా స్త్వ్యాళికలశబృందములగాధజలాశయములనూ
కు । పురిలోనజెరలాడుతరుణీమణులకోక లూడ్చితెన్నునకడ్డముండిన
వ్వ । జనువారిచరమదేశముజేరిమెడవంచి పైనెక్కినడిపించిపరిహాసిం
చు । భవనములుగాల్చిబిట్టుచప్పట్లుగొట్టు । బెద్దలేతేర గడుబిట్టబిగిసి
యుండు । నట్టియసమంజసునిపైమహాగ్రహంబు । నిండినగరోర్వరాఖం
డలుండుబల్కె ॥

చ॥ తులువతనంబునన్ బుధవధూమణులంగలగించిచిన్నిపా ।
పలసరయూప్రవాహమున జారగవైచితనూనపాచ్ఛిఖా । వళినిలయంబు
లంగెడపి వైచినసీచునినిన్నుపట్టిగా । దలచిసహించినన్ వెతగదాజగదా
క్రమకీర్తిశాలికిన్ ॥

క॥ నిర్మనుజద్వీపంబున । దుర్మార్గుడవైననిన్నుద్రోయింతుభవ ।
త్కార్యంబిటుఫలియించెన్ । బేర్మివిడువుమింకజన్మపృథ్వీస్థలిపై ॥

చ॥ అనివచియించి యానరవరాగ్రణి డెందము రాయిజేసి
యా। యనవతి దూరదేశమున కంపె కుమారులు బంధులాప్తులీ।
రనికృపదాల్చిచండ విభిక ర్తల జేయక యుండిరేని యే। యనువున నాజ్ఞ
జెల్లు మనుజాధిప కోటుల కుర్వరాస్థలిన్ ॥

సీ॥ ఉరగేశ్వరస్ఫుటోత్కారము లుత్పాతలూగగ విహార
ముసేయ గడగుచుంద్రు। శింశుమారరథాంగమంశు మర్గ్రహ ముఖ్య
ములుకూల ద్రిప్పదురలఘుపటిమ। దిగధిపగ్రామణు లైగడ తత్పు
రసాల కుడ్యముల్గూల నూకుదురుడాసి। సంగడంబులు జేసి సప్తాద్రుల
నమింటి తుదిదాక జిమ్మి పట్టుదురుగెరలి। చెదర నార్తురు నెలలోని జిం
కపోతు। నర్కవాజుల జూలూడ్చు రడ్డగించి। క్రూరులై సర్వవిష్టప క్రో
డభయద। చారులై ధాత్రిసుమతి కుమారులపుడు॥

గీ॥ ధారుణీస్థలి నిట్లు దైవారునిజకు। మారవరులును మను
మడాత్తఘనశాస। నమునవర్తిల్ల సగరభూనాథుడేలు। చుండెనఖిల
వసుంధరామండలంబు॥

మ॥ సకలద్వీప మహీప భూరిమకుటస్థానోజ్జ్వల త్పద్మరా।
గకలాపాంశు పరంపరానిచిత పత్కంజాతు డుర్వీశతా। రకరుండాసగ
రుండు నిండుకొలువై ప్రాజ్ఞచ్ఛటన్ మిత్రరా। జకులంబున్ గురుమం
త్రులన్ సుతులనాస్థన్ గాంచి దానిట్లనెన్॥

శా॥ సర్వారాతి వరూథినీమదతమ స్సంఘాత సూర్యాయి
తా। ఖర్వోత్తుంగ పరాక్రమాన్విత భుజాకాంతుండనై యర్ణవాం। త
ద్విశ్వంభర యంతయేలితి ననూనశ్రీలు గైకొంటినం। తర్వాణుల్గాని
యాడవీరులగు పుత్రశ్రేణులన్ గాంచితిన్॥

క॥ చాలన్ గాలముదాటె వృ। ధాలంపటగాడె యివ్విధపు
సంసరణో। ద్వేలాంబుధి ప్రాలుటయిక। నేలవితర్కింప నొకటి యేను
దలచితిన్॥

క॥ అదిమెట్టిదంటిరేనివి। శదమూర్తి సుమేరు గూర్చి స్తవ

సంబోసరిం। చెవ రాజయోగ్యములు మీ। హృదయంబున నెంచి చెప్పు డిప్పుడో కదానిన్॥

ఉ॥ నావిని వారలందరు జనప్రభుశేఖర తావకాత్మరా। జీవమునందు మెచ్చొదవ జెప్ప సమర్థులు లేరరుంధతీ। దేవిమగండు దక్షకులదేశికు నాఘను వేడి జేయుమ। య్యావరయజ్ఞమున్న నృపుడాయన కంజలి జేసి యిట్లనెన్॥

క॥ మునులకు మేటి వివనజా। సనుసూతివికులగురుడవు శాస్త్రజ్ఞులలో। ఘనుడవు మిమ్మీ సభలో। గనిపల్కితి నానతిండు గరుణామూర్తీ॥

క॥ అనిన న్వనజాసననం। దనుడిట్లని పల్కె ఘనఘనాఘనగర్జా। నినదప్రతిమోన్నతినో। దినపృథుగంభీరవచన నియతిన్ బ్రీతిన్॥

క॥ సగరాధిప హయమేధము। సగరానిఫలంబులున్న త్యాపాలమరు। న్నగరాజము గాదే సే। యగరాదే దానిసత్క్రియాశీలుడవై॥

శా॥ పంచైనో మహి భృచ్ఛతౌరసుపపాప క్రూరమత్తేభరా। ట్పంచాస్యంబు హృదీప్సితార్థదనుపర్వత్యారుహంబై ప్రకా। శించున్ రాజులకశ్వమేధము సుధాశిస్స్వామిచే మున్ను జే। యించం జేసెను డివితానములు నూరిష్టక్రియాసిద్ధికై॥

ఉ॥ నావుడు సార్వభౌముడు వినమ్రతతో నతులాచరించిస। ద్భావమునీంద్ర యీక్రతువపార కృపారస ముప్పతిల్లస। న్నేవిధి జేయ జేయుదొ మహీన్ ధిషణుండు బలారిచే సుప। ర్వావళి కెల్ల హర్షమొదవం బొసగింప నొనర్చు వైఖరిన్॥

గీ॥ ఇవ్విధమున బల్కి యిలరేడు నిజసుతా। వళుల జూచి వింధ్యవసుమతీధ్ర। శీతశైల మధ్యసీమ నీక్రతువాచ। రింప వలయు దగిన రీతి మీరు॥

మ॥ క్రతుశాలల్ రచియింప జేయుడు సమగ్రద్రవ్యధాన్యచ్ఛటల్ జతగూర్పం దగు యత్నముల్సల్పుడీ సమ్యక్సమిత్పాళులం। చితపున్ ప్రసు

క్రన్నిపం క్తులకా గడువడికా జేరంగ జేయుండు. మా। రతిభద్రంబుగనంచు నంశుమదభిఖ్యాకున్న ప్రెత్రాగ్రణికా ॥

క॥ కనుగొని మునిరాజులుగల। వనములకుం బుధులనంపి వారలనెల్లన్ । మనయాగమునకు దెమ్మా । జనవిభులన్నానెనన్ను సౌన్యనిధీ॥

క॥ అనిపల్కి శ్రౌతవిద్యా। ధనులువిపశ్చి త్కులావతంసులు దనచు। ట్టినయట్ల దత్కార్యాలోచ। చనలమహాసక్తి తద్రాష్ట్రవిభుడుండెన్ ॥

గీ॥ అంశుమంతునిపనుపున నవనిదివిజు। లాశ్రమంబులకరిగి హృద్యమగుభక్తి । సగరుహయమేధ మొరిగింప సంతసంబు। దొరలనెల్లను జడదాటదొరలదండు॥

సీ॥ హారితసారద పిప్పలాదకణ్వకణాద శాతాతపాత్రేయ జైమినులును। చవనజాబాలి గాలవమండపాల మార్కండేయ మాండవ్యగౌతములును। మాండకర్ణసుతీక్ష్ణ శాండిల్యపులహాంగిరస భరద్వాజగర్గవ్రతులును। శక్తిమైత్రేయ కశ్యప పులస్త్యాగస్త్య కౌశికాష్టావక్రకర్దములును। మరియును సమస్త రాజర్షిమహిసురర్షి। నిర్జరర్షి వితానమానేలరేడు। గరపుత త్తడి జన్నంబుగాంచువేడ్క। నరుగుదెంచిరి సాకేతపురికి గూర్మి॥

ఉ॥ ఈగతిబానవాలు దొరలెల్లను రానెదురేగుదెంచి భక్త్యాగసమానధైర్యుడు నరాధిపమౌళి నిజాగ్రగహ్వరీ। భాగముజత్రరూపముల భాసిల హాటకరత్నజాలకా। భోగకరీటమౌముని సమూహ పదాబ్జము లంట మ్రొక్కుచున్॥

క॥ కొనివచ్చివారినుచితా। సనముల గూర్చుండబెట్టి జనపతితత్పా। వనపదసేచనజలములా తనపైజల్లుకొను చద్య ధన్యోస్మియనెన్ ॥

శా॥ ప్రాలేయాచల వింధ్యమధ్య ధరణీ భాగంబునన్ యజ్ఞ

శా॥ లాళుల్ రాజ నివాసముల్ మునినికాయశ్రేణులు స్కంధురా॥ పాళుల్ వారణ గేహము ల్భటజన వ్రాతాలయంబుల్ సమ॥ జ్యాలేఖల్ ధనధాన్యధామములు ప్రోద్యద్వాస్తు విద్యావిధిన్॥

క॥ గట్టిపనినలరుతక్షుక॥ ధట్టంబులచేతసగర తనయులువరుసన్॥ గట్టించితజ్జనులచే॥ కొట్టించిరిదారుపాత్ర కోటిరయమునన్॥

మ॥ సనిగల్కందులు తండులంబులును మాషశ్రేణులు వ్రాజమా॥ష నికాయంబులు గోధుముల్పెసలు దధ్యాన్నంబులన్నాసులై॥ పెనుగట్టల్పలె తేజరిల్లెదధి సర్పిక్షౌద్రదుగ్ధేక్షుగో॥ స్తనులుం గ్రాలె సమృద్ధిగా నృపసుత త్రాతంబులై యచ్చటన్॥

క॥ ప్రేమన్ సమిత్కుశములుఁగు॥ హోమద్రవ్యంబులెల్ల నొనగూర్చినయా॥ శ్రీమెరయుకాయగూరలు॥ దామందమరించి రాజధానికి వేగన్॥

ఉ॥ వచ్చినిజాత్మజుల్ సకలవార్తలు దెల్పిన చక్రవర్తి దా॥ నచ్చటికేగనెంచి సచివాప్త భటాదిజనాళియున్న గా॥ బుచ్చియు బంధుభూమి పతిపుంజముతో జని యజ్ఞవాటికన్॥ జొచ్చిక్షణంబులిచ్చె పరిశుద్ధతరర్త్విజ పాళికాదటన్॥

గీ॥ ఇవ్విధంబున దీక్షవహించిసగర॥ భూమహేంద్రుండు పుత్రుల భూరిబలుల॥ జేరరావించి యజ్ఞవాజినిటుదెండు॥ వసుధనంతట ద్రిప్పి తేపలయునసిన॥

సీ॥ అమితధారావిలాసమున జెన్నగుదాని సమధికకాండమై యమరుదాని॥ ఘనతదావర్త సంఘాతంబుగలదాని విశదప్రవాహమై వెలయుదాని॥ నిబిడమాకీర్తికి నెలవైబరగుదాని నిస్తుల ధ్రువశోభ నెగడుదాని॥ వరుణాశ్వసమితిలో బడిపోవజనుదాని కవికాస్పదంబైన గరిమదాని॥ భావికాలాగత సురాపగావిశేష॥ సూచ్యమానాధ్వరహరినిసుభటులపుడు॥ దెచ్చినిల్పినరుత్విక్తతియువిభుండు॥ గాంచి హర్షించి చెంగట గదిసినిలిచి॥

మ॥ జగతీచక్రభరంబ శేషము భుజాసర్పేంద్రునందుంచి శా
ర్యగరిష్ఠస్థితి దేజరిల్లు సగరజ్యాభర్తఁ వార్వంబుదీ। నిగడుంరక్షణసేయ
దత్తనయు తెంతేడాసియున్నారు ప। ట్టగవచ్చుఁ నృపతుల్పరాక్రమ
నిరూఢశ్రీవ్రతుల్ మేదినిఁ ॥

క॥ అనియీాగతివ్రాసినశో। భనకాంచన ఫలకమళిక భా
గంబునస। య్యనగట్టించి నిజప్రియ। తనయుల వీక్షించిపల్కె దయమై
వారఁ॥

గీ॥ తనయులారసవాశ్వంబు ధాత్రిదిగుగు। వేళనేవీరవరు
లాపి విడువకున్న। బలిమివిడిపించి పర్వేలమెలగ జేసి। ధెండఖండపరా
క్ర మాదిత్యులనగ॥

గీ॥ ఇవ్విధమునబల్కి యిలరేడుదీక్షతో। నుండెనంతసాగ
రోత్కరంబు। సప్తి వెనుకబోవ సమకట్టు నెడతద్ధ। యంబు మాయమ
య్యె నద్భుతముగ॥

క॥ అనవినికధకుంగనుగొని। మునులిట్లనిరపుడుజన్న వృంద
త్తడిచే। కొనిమాయావిధినెవడరి। గనొదెల్పుము మాకుసూత కీర్తిఁ
సమేతా॥

ఉ॥ నావినిసూతుడిట్లనియె। నాకమునందలపాకహుండయో ।
ధ్యావిభునందనుల్ ప్రబలురైదిగధీశులనోర్చి సర్వలో। కావళినేలజూతు
రకటా శకటార్యవతార మొందుగా। కీవసుధఁజయింపగలరే యిలరేడు
లు నిర్జరాఘములు॥

క॥ భువిగపిలాచార్యుడుహా। ర్యవతారము తద్ద్రుగగ్ని కా
హుతులైబి। ట్టనయుదురని తలచియునజ్జవనాశ్వము దొంగిలించి సాహ
సవృత్తిఁ॥

చ॥ అరిగితపస్సమాధి జనితాయతసౌఖ్యము నొందుచున్న
యా। నరసునిజాంతికద్రువున సంధిలజేసి పురందరుండుని। ర్జరపురికేగె న
ష్టహుతురంగము వోవుటగాంచితంద్రికి। త్తైరగెరిగించినఁ సుతతతింగని

యజ్జనాధుడిట్లనెన్॥

ఉ॥ తేజియదృశ్యమాయెనని తెల్పగనేటికి బుత్రులారసన్ వ్యాజుడెవండొ యీమహితయజ్ఞము మాపగనెంచి గైకొనెన్। వాజిని విష్టపత్రయ నివాసులనారసి దుష్టపాళితో। నాజికిదారసిల్లి యెటులైన మఘాశ్వముదెండు పొండికన్॥

క॥ ఏమరితిమిసవనాశ్వము। నేమనుజాశనునికృత్య మిది యగునోయిం। కేమార్గము దొరుకున్నన। కీమఘము నిరంతరాయ మెట్లగునెకదా॥

గీ॥ సవనమభిమంత్రితంబై ప్రశస్తమొందు। చుండెమనుమనితో దీక్షనుంటినేను। తొలుత తెరగంటి వీజెక్కి కలయవెదకియవల మధ్యమలోకంబు నరసిపిదప॥

క॥ ఈజగతిన్ మీరొక్కొక। యోజనమాత్రముగ ద్రవ్వి యురగస్థలిబా। బాజాడదీసి జేకొని। రాజనదేదర్ప మూరరాసుతులార॥

క॥ అనిచక్రవర్తి నిజనం। దనులం బనుపంగనాకనగరంబు నకున్। జననిశ్చయించివారుప। యనమైరి ధృతామితాయుధాటోపమునన్॥

సీ॥ కరవాలశూలముద్గరభిండివాలతో మరముఖాయుధపాళులిరులనీన। నలఘుపతాకరేఖాగ్రాంశుకాంశుగావళులంబు ధరకదంబములదోల। దోస్ఫాలనధ్వని స్తోమంబుసింహనాదములజాండకరండతలముప్రేల్ప॥ చరణఘట్టితధరాచక్రనిర్యత్పాంసు నిచయంబు దెసలంది నింగిప్రింగ। నడచిరిమరాద్రి జేర జండతరపటహ। ఢాంకృతినిరస్తదిగిభఘటావిశాల। కర్ణకోటరులగు తద్గ్రావకటక। పటలి కెక్కిరి తన్నృపాగ్రప్రతతిబర్వ॥

మ॥ గరుడవ్రాతముజెల్లబట్టె తొలుతన్గంధర్వసంఘంబువే। గరిచెన్ ఘూసమి గాటిపాపలగుచున్ ద్రొబారిరారుద్రులా। తురులై నిర్వసుపాళులట్లు వసుపంక్తుల్ప్రొవ్వెనవ్వేళసా। గరులుద్యత్ప్రతి భా

ధ్యులై దివిజలోకంబెక్కు వార్తాశ్రుతిన్ ॥

క॥ సగరకుమారులు నిర్జర। నగరమునకు సవనవాహన ని
మిత్తము బిట్టుగ దాడివెట్టిరని విని। దిగులుననిట్లని తలంచె దేవేంద్రు
డెదన్ ॥

చ॥ సవహయమేనుగొన్న కథ సాగరులెట్టు లెఱింగిరో క
దన్। జవమున వీరలిచ్చటికి సాగుదురే మదిగాంచకున్న బి। ట్టవియగ జొ
చ్చె డెందమహహా హరిశంకర వేధలైననే। దవమతిబొందరే ప్రకటితా
హవదోహలులై యెదిర్చినన్ ॥

క॥ కడజన్న కర్జమునకున్। దడవినపనియేమి దేవతాపురిగప
నుల్లఘువశి నాకమున్ని। యెడరునకుం దొలగుటొప్ప దే నాకనుచున్ ॥

సీ॥ దివ్యాంగయజ్వశూరవ్యూహములతోడ నప్సరస్సమితి
బాయంగజేసి। చతురర్ఘులను ధర్మశాస్త్రంబునుదార్చినట్టిప్రాజ్ఞు లె
పని కాయములననిచి। సకల దానములిచ్చి శాశ్వతకీర్తి జేకొన్న వారల
నల్వకొల్వుజేర్చి। వరసుధర్మాముఖ్య భవ్యవస్తూత్కరంబులన గోచరపు
పట్టులను మాటి। కలసిముప్పదమూడు కోటులనుపర్వ। లును జయం
తుండు శచిరాగ ఘనహయుండు। డాగెనూర్ధ్వజగత్ప్రకాండముల గాం
డ। ముయనార్చుచు సాగరుల్దవిలిరేచి॥

చ॥ త్రిదివము జొచ్చియచ్చ టెవరింబొడగానక సద్దిరయ్యె
యో। పదసుదొరంగి పోయిరొకో పాకవిరోధి మరుద్వరూధినుల్। క
దనవిభీతులై యనుచు గాంచినుతించిరి తన్నికాయసం। పదలును వై
జయంత ముఖమంగళ సౌధకళావిలాసముల్ ॥

మ॥ బలజంభ ప్రముఖసుపాచరజయ వ్యాపారముల్లేడగో
డలయందారసి వీరశేఖరుడు వీడాప్రీడలేకిట్లుపీ। ఘులకుంగన్పడ జేసెక
ల్లకథలస్తోక ప్రతాపంబుతో। దలపడ్డన్నతోడ నమ్ముదుము గోత్రద్వేషి
నంచాస్చుచున్ ॥

గీ॥ వేలుపులవీట నిల్లుల్లిల్లు వెదకి వెదకి। కోటకొమ్మలనెగబా

కి గోపురముల। కెక్కి నందనవనిలోని జేగియారసి పవనధారాట మక్షి
గోచరముగాక॥

ఉ॥ మేరువుమీఁదనుండి పుడమింబడదూకగ రాజనందనుల్
ధారలునూరుగల్గు బెడిదంబగు కైదువుపిండిదాకిన। ట్లీరస(గుంగె భూ
భరపు టేనుగలుక్కరి (మొగ్గనిర్జరా। గారపు శృంగముల్గదలి కంపము
నొందె తదూర్ధ్వలోకముల్॥

సీ॥ ఉదయాద్రి మృగభయ (పదముగానార్చి యవ్వలబా
సిచని చ(కవాళమొరసి। దర్దురమలయగో(త్రయమాలయములు (గద్ద
నదాటి కడగట్టుదాకదరిగి। తార స్తగిరి(గుంగ దత్కూటముల కెక్కి
తరువాత వలయ భూధరముగాంచి। (ప్రాలేయసానుమ(దాజగుహాదే
శములు జొచ్చి తునమొప్పు మలకుబోయి। చివరక వధికుభృత్తుంగశృం
గపటలి( దొరసితచ్ఛర మోగ్రాఘ దుర్భరాంధ। కార మొక్కటదిలకిం
చికంపితాంగు। లగుచు(గమ్మరి సగరరాజాత్మభవులు॥

ఉ॥ జన్నపువార్వమెచ్చటికి జన్నదిగానక సర్వకుంభినీ।
భృన్నగికీవనుల్మెన్నవాకి వేసటతో మనకత్తళాని జే। కొన్నదురాత్ముఁల్లి
దిను కోనటిమై బలుకండట చుదా। రెన్నుచుగన్నవాని నలయింతు
రు (దుంతురుహేతిసంహతిన్॥

సీ॥ పల్లెలూరులు వన(పతతులు పక్కనంబులుగట్లు కోన
లుకొలకులగములు। (పపలుకోటలు జప్పరాలు నుద్యానముల్సందులు
గొందులు సావడులును। మందు గావళులు సామజశాలలురురాజధా
నులు పేటమొత్తములుపొదలు। మఠములువాగులు మరుగులుడొంక
లు బీళ్లుతీర్థోర్వ్యాలు గుళ్లుగలయ। వెదకివెదకి సర్వవిశ్వంభరనుయజ్ఞ
వీతి గానలేక భూతలాధి। పతికుమారులొక్క పట్టున జేరియా। కరణి
నొండొరులనుగాంచియనిరి॥

మ॥ హరిపాటచ్చరు డక్షిగోచరుగాడాహాధరి(త్రీ(ద్ధభి।త్పురి
నేనిన్ ధరనేనియుం కెచట నస్తోకోద్ధతింజూతమి। త్తరిధారాటము గాన

కెన్నా జనకుం దర్శింపగా బోదమం। దరమాభోగి జగత్ప్రదేశము గనన్
ధాత్రిం బెగల్చన్ దగున్॥

క॥ ధరద్రవ్వియురగలోకం। బరసిహరిం దెందు జివరకనడే
మఃభూ। వరుడదిమరువక యూగ। వ్యారిభవింతమని సగర వసుధేశ
సుతుల్॥

మ॥ శతకోటిప్రతిమోగ్రశూల వితతుల్ సాగుల్ల నిత్రంబు
లుం। శితకుంతంబులు దోమరప్రకరముల్ శీరాళికుద్దాళనం। తతులున్
ఖన్మషి దాల్చివారు జగదండంబూగ గర్జించిగ। ద్వితులై ద్రవ్వగసాగి
రుర్వరమరుద్రింఛోళి భీతిల్లగన్॥

ఉ॥ గట్టులబోలినట్టి పెనుగడ్డలు దీర్ఘపుగడ్డపారలన్। ద
ట్టిపెగల్చి పర్ణపము దాల్చిన పోలికనొక్కటొక్కటిన్। బట్టితటంబు
పైకెగర బారగవైచుచు పర్వతాళిజూ। పట్టిన నెట్టిరొడ్డులకు పట్టగలిం
చి కుభృత్కుమారకుల్॥

ఉ॥ లోతునడుల్లుమన్న జనలోక పతిప్రియ నందనోఘ
మెం। తేతడవబ్బు పైతటికిదియని దేలనటంచు గొబ్బునన్। వాతికిజేర్చి
త్రిమ్మంగుచు జనంబునకొక్కని కొక్కయోజనం। బైతనరంగ ద్రవ్విరఖి
లావనినందరు చక్రవైఖరిన్॥

గీ॥ ఈకరణినాగలోకంబు దాక యోజ। నంబు లర్వది వేలు
భూనాధసుతులు। వసుధబెగలింప ఫణిజగ ద్వాసులయిన। కాలకేయు
లు విస్మయాక్రాంతులగుచు॥

మ॥ ఉరగావాసమిదేడ భూమినరులోహో వచ్చియేనాడు
వ। చ్చిరిగర్వోద్ధతినిట్టులన్న నముపేక్షీభూత వృత్తిన్ గృహా। త్కారము
ల్వాయక యున్న దారిగొని మర్త్యగ్రామణుల్ రారెయా। కరణింజు
ల్కనివైతిమింక నమదోగ్రస్ఫూర్తిన్ దాకందగున్॥

క॥ అనితలచివారురణసా। ధనములుకంఖాణగజ రథంబుల
తోలా। కనికాయములర పెండ్లికి। జనుపగిదిం దరలిరుగ్ర సమరా

కాంతుఁడ॥

ఉ॥ సాలకటంకటేయులు బిసప్రసవాసన దత్త సద్వరో। త్తాలతర స్వరూన్వితులు దారుణమూర్తులు కాలకేయులు। క్కాలము నందెసంగెను తెగల్ ద్వివిధంబుగనై యుగాంతపుం। గాలునికోరమీస ముల కైవడిలోక భయంకరాకృతిన్॥

క॥ ఇరుతెగల రక్కసులనా। గరులపయిన్నడచువేళ గగన మునిండెన్। పరుషతర పటహధ్వాంకృతి। చరణవినిర్దళిత భూమిచక్ర రజంబున్॥

మ॥ పటహధ్వానము లాలకించి వసుధాపాంసు చ్ఛటల్ గాంచిరి। క్రతలముల్ దుల్లెడు రీతిజూచి సగరక్ష్మాజాని పుత్రాళులు। త్కటరోషంబున నుండొరుంగని యహోకయ్యంబుగావింపని। చ్చటికేతెంచద రెవ్వరో బ్రతుకులెంచన్ లేవ కోపీరికిన్॥

క॥ అనిగర్జిల్లుచు ధాత్రిన్। ఖననము సేయుటలు విడి గాఢ ప్రతిఘన్। గనుదమ్ములనింగలపున్। దునకల జడిగురియ నేర్పుతో వ్యూహవిధుల్॥

శా॥ శృంగారించుచు తోమరంబులు ఖరాశిశ్రేణులుంశూ లముల్। సింగాణుల్ధనులుంబరశ్వథ గదల్ ఖేటంబులుం బ్రాసముల్ రంగత్ప్రైసభిండివాలములు దుర్వారోద్ధతిం దాల్చిచో। రంగేళీగతి బోల్చిరారని రణారంభంబునం సాగరుల్॥

ఉ॥ అక్కడిరాక్షసప్రవరులందరు డాయగ వచ్చి ధారుణిన్। వ్రక్కలుసేయుజొచ్చితి రవార్యమదంబున నింతసేయమీ। రెక్కడివా రలెందు కొరకిట్లొనరించితి రింక ప్రాణము। ల్దక్కవు నిక్కమక్కట వి ధాత్రుడు మీకిట్లు వ్రాసె పోభువిన్॥

క॥ అనవిని రోషించి ఘనా। ఘనగర్జానినదమున సగరనంద నులి। ట్లని రేము సాగరులమని। జనదావప్రావృడుగ్ర జలధరులమిలన్॥

మ॥ పవకంఖాణము వోయెచోర హృతమై సర్వంసహా

దానికై। దివమున్ మర్త్యము జూచి కానక ధరిత్రిం ద్రవ్వి పాతాళపుం। భువనం బారయ నుద్యమించితిమి మమ్ముం దాకి బోరాడలే। కమరుద్వల్లి భుడేగ ఘోరపవిజంకన్నాటి సంత్రాసియై॥

క॥ కానంధరమున్మేచం। దానన్ మార్గోన్నిరణంబునం బ్రతుకగలా। కేమంగల తోననికిన్। బూనంగల వేళ శౌఘుములు ధైర్యమునన్॥

ఉ॥ నావినియాతుధానులు జనప్రభుసూనుల గాంచియార ర। శ్రోవితతుల్నరాళిదిని తుత్పరిపీడనడంతు రిప్పుడీ। కేవల శౌర్యమెట్లు జనకీటకపాళికి గల్గెనంచురో। పావిలమూర్తులైకదిసి రార్పులు నింగిబగుల్ప నొక్కటన్॥

గీ॥ చటులపమితికిమార్గోన్ను శత్రుసమితి। గాంచినగరాత్మజులు కరోగ్రతరమండ। లాగ్రముఖ్యాయుధములు దళముగగాలు। జీకటుల నినదాకిరస్తోకపటిమ॥

ఉ॥ అయ్యొరువాగువారలు నిజాంఘ్రిచయోగ్రఘనావరాగము। ల్గయ్యపులచ్చికుల్లెడలు గాగనుపట్టకరాయుధాంశువు। ల్వయ్యరతంద్రి పైకెగసి పంకజబాంధవ భానుకోటితో। వియ్యము సేయబోరి రరవిందభవాదులకున్ భయంబుగన్॥

మ॥ కలనన్ శూలగదాధనుర్నికరముల్ ఖడ్గంబులుంజూర్ణమై। బొలియం దారుభుజాభుజిం దొడరి నిర్మూలంబుగా బోరుచో। గలిగెన్ గీకస పాంసుసైకతశతల్ క్రవ్యోరుపంకల్పముః। జ్వలివచ్ఛత్ర సితాంబుజల్ నదసృక్సారాపగల్ తద్రసన్॥

ఉ॥ సాగరులుగ్రకోప విలసన్నయ నారుణదీప్తులగ్నిగా। భోగవతీకుచంబులను బూసినకుంకుమ రేఖలైతగన్। తేగల కుంభకల్నరికి తీవ్రపుటీటెల రొమ్ములూడ్చినన్। వేగమకాలకేయకుల పీనులుకొంపదు వారిరార్తులై॥

గీ॥ బలసిసాలకటంకటేయులును కాల। కేయులాక కొం

దరతిరుషాకీలితాత్ము । లగుచు సాగరులనుదాకియానమీాక । ధాత్రిగం
పింప బారిరిపతుణంబ ॥

గీ॥ ఈశగిరిరిరిచ్ఛేషంబుగా పలాయ । నంబెనంగివిపంధిగ
ణంబునోవ । కలహారంగంబునందు సాగరులుధూమ। కీలికణములు నా
వెలింగిరిజలంగి॥

గీ॥ శత్రుకోటిదాలగిచనిన సర్వాని వేల । యోజనములు త్ర
వ్వియాజగతిని । గానమైతిమిచట కంఖాణమిక రేని। కెరుక జేసికర్జ మె
రుగవలదె ॥

క॥ అనిసాగరులందరుజన । కునిపాలికి బోయిమేము కువల
యమెల్లన్ । గనినారముదుఖాకరము । గొసిచనుచోరుండు దొరుకకుని
కి గలుగుచున్॥

చ॥ అరువదివేలయోజనము లద్భుతవృత్తిధరిత్రిద్రవ్వభీ । క
రులగు రాక్షసావళుల గయ్యముమూకులభించెనంతన । య్యాదులపరా
భవించితి మహాంకృతి హార్యపహారిజిక్కలే । దరుదిదిగాదె సెల్వొనగు
మాతుది కర్జమిలాబలాహితా॥

మ॥ సరణింగాంచిన సిద్ధసన్నగ మరుత్సాధ్యాసురశ్రేణిగా।
సరదుఖాకరపురంబులోనికరుగన్ శౌర్యంబునంబేర్చిభీ। కరభంగిత్ర
త్రిదివంబుజేరు నెడలేఖస్వామి ఘోరార్తుడై। బరచెన్ ముప్పదిమూాడు
కోటుల సుపర్వవ్రాతముల్మున్నుగన్ ॥

క॥ రవిచంద్రకిరణజాలము । లవనిస్థని నెంతదూర మానుత
దుర్వి। న్దవమున నన్వేషించియు । భువిద్రవ్వితిమింక నెల్లు బోవలయు
నృపా ॥

క॥ అనవినిగనలిమహీవిభు । డనియెన్ సుతులార నత్రహ
య చోరకుగాం । చనిపనిచేబడలితిమని । వినిపించితిరహాా మే వివేకుల
కువినన్ ॥

క॥ ఎవ్వోటనేనిద్రముచ్చున్ । ద్రవ్చిహరిందెచ్చి యధ్వర

ముగడ తేర్పఁగ । పచ్చుటవచ్చుటయూర కే । వచ్చుటగని మిమ్ముమెచ్చ వచ్చునెనాకుఁగ ॥

గీ॥ మానవేశ్వరుడిట్లాడ మగుడిసగర । విభు సుతులుదాము త్రవ్వినవివరసీమ । జొచ్చిచనుచుండిరన సూతుంజూచి శౌన। కాదులవ్వలికథ దెల్పుమనియనుటయు॥

మ॥ కలుషోర్వీధరశంబశంబరద కంఖాణాది యజ్ఞాశిసా జలజాతారుణబింబబింబఫల భృఙ్గారాట చైత్రైంద్రిని । ర్మలిసచ్ఛవ్య వలంబలంబ కరధర్మక్రూర పత్రిచ్ఛటా । చలితోగ్రాసుర డింబడింబ భవరాజ్య శ్రీవిభుస్యందనా ॥

క॥ గోత్రాంబుజాల యాధిపగోత్రావన కారణోద్ధగోత్రోద్ధరణా । గోత్రస్మృతి మాత్రసుధీ । గోత్రపవిత్రప్రచారి కుమతవిదారి॥

భుజంగప్రయాతము ॥ సుధాధామ శేషాబ్జ శోభాచ్ఛకీర్తీ । బుధాపద్ధవేంధాన భూర్యభ్రమూర్తీ । కథాభూతభక్త ప్రకాండాఖిలార్తీ । విధూమాగ్నికీలా భవిక్రాంతవర్తీ ॥

గద్య ॥ ఇది శ్రీమద్దక్షిణామూర్త్యష్టమూర్తి దాక్షిణ్యానులబ్ధ
కవితా సారశౌనక గోత్రారామపటీర సుభద్రాంబికా
పిచ్చయామాత్యకుమార తురగాన్వయ పయస్సాగ
రాభోగ తారాజార వేంకటకవిధీర ప్రణీతంబైన
నిర్వచన భగీరథోపాఖ్యానంబను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము॥



శ్రీరమణీహృద్రమణమ । సారమణీసన్నిభాంగసకలావనభీ।మా
రామదాసనుతపద । సారసగుడిపూడిహరినిశాటభహారీ॥

గీ॥ అవధరింపుము శౌనకాద్యఖిలమునుల । గాంచినసూతుండుబ
లికెసాగరులుజనకు । వలనగ్రమ్మరిగ్రమ్మరవసుధద్రవ్వ । కంపితములయ్యె
నఖిలలోకవ్రజములు॥

ఉ॥ అత్తరిదేవమానులఖిలాజరులింద్రముఖాష్టదిక్పతుల్ । మొ
త్తములై యహోసగరపుత్రకులర్వదివేలవారుదు । ర్వృత్తిధరిత్రిద్రవ్వి
విధి సృష్టినడంపగజొచ్చిరీమహా । పత్తుదొలంగజేయగనె వండుగలండని
బ్రహ్మపాలికిన్॥

క॥ చనిమ్రొక్కిరపుడు హేపా । వనగుణగణ సకలలోకవల్లభ
వాణీ । వనితాధిపభక్తజనా । వనభవలోనమయటంచువారేకమితిన్॥

క॥ ఈగతినభివాదనమిడి । వాగీశ్వరసగరసుతులవార్యోద్ధతినా।
నాగహ్వారిభేదించిరి । యాగాశ్వముకొరకు వారినాపందరమే॥

సీ॥ కులమంవొకడుసేయు ఖలవృత్తిగరులారె నేడూడవలసెనం
చాడెగిరులు । కడలనుండియుదప్ప బడనిమాకిటుపోని గలిగెగాయనియ
ష్టగజములడలె । నేమిసేయుదుముదిక్కెవ్వారుమనకంచు నహివరాహ
ధులీంద్రులళకువడిరి । వరణాంబుపులలోన ధరదునక్కై పోవ నిలుతు
మేయనిలోకములుగలంగె । నొకపుడమిలోనెబోవునేయకటవారి। జాన
వాండంబునకునెల్లమోసమబ్బె । ననిభయంపడిరందరయ్యాగడంపు। సా
గరులచైద్యములుగాంచిసారసభవా॥

చ॥ సరసిజగర్భయీకరణి సర్వజగత్తతిమావనిట్లుసా । గరులు
గడంగిరక్కట సుఖస్థితిజీవులకెల్లదప్పెని । త్తిరిప్రతికారమీావెడదదల్ప
కయుండినసీదుసృష్టికిం । జెరుపుఘటించునేడనకుశేశయజాతుడు వారి
కిట్లనెన్॥

ఉ॥ నాకెవడిచ్చెసృష్టికరణప్రభుతావిభవంబువాడెవ్వా । లోక
గురుండుశశ్వవి విలోకుడనామయుడచ్యుతుండుద । ర్వీకరశాయిసర్వగు

డువేధమయుండు సనాతనుండతం । డేకదదుష్టకోటి వధియింపగశిష్టుల బెంపబొల్చెడిన్॥

గీ॥ ఆసహస్రారధారిదివ్యావతార । ములుగలవు పెక్కులందుని ర్మలినబోధ । కారికపిలాకృతి వెలుంగుగాననతని । కంటిమంటలచేవారు గ్రాగగలరు॥

క॥ విశ్వకభగకధిపతియల । విశ్వంభరుడగుటనీభువికికీడుమదిన్ । విశ్వాసమెసగకూన్చిఖ । గాశ్వునిచేముడియరే మహామహులారా॥

క॥ అనిపల్కినాల్గుమొగముల । ఘనుడందరిజూచిపల్కె గ్రమ్మరనమృతా । శనులారకలుషకుధరా । శనులారవినుండుపూర్వచరితము ప్రీతిన్॥

సీ॥ మనువుస్వాయంభువుం డనువానినెరుగరే యతనిపుత్రుడు ప్రియవ్రతుడుదొల్లి । నారదమహానిచే నారాయణప్రియ భక్తివిజ్ఞానంబుబడసినకల । సామ్రాజ్యవిముఖుడై చరియింపనమ్మహాత్మునితండ్రిననుగూర్చి వినుతిసేయ । నధికకృపాప్తిసేనవదెంచి ప్రభుతయుందాసక్తియొప్పారునట్టిమాట । లాడిరాజ్యభారమాపాధివునిచేత । దాల్పజేసియాత్మధామమెనసి । నాడవాడుబెక్కు నాడులానాడుల । నన్నియేలెధర్మమతిశయిల్లు॥

ఉ॥ ఆమహీవల్లభుండు దుహీనాహితపశ్చిమభాగభాక్తమ । స్తోమములార్చి రేలుపరిశుద్ధములైనపగళ్లొనర్చుతే । జోమయమహారథంబుగడుసొంపుననెక్కిచరించెనేడుమా । ర్గేమనిజెప్పుచున్ సుర గిరీంద్రముజుట్టు ప్రతీనవైఖరిన్॥

చ॥ తనరథవేగమక్కని శతాంగముతోనెనజేసిపోవుచో । ఘనతరమైననేమి మొనగాడినచోట్లుసముద్రసప్తకం । బనసుతికెక్కెసంధులలరారెనుదీవులు నాజగంబునన్ । బనుపడియంతరీపములువార్ధులకున్ సదృశంబులైతగున్॥

గీ॥ జలధిచుట్టుసాగరులుగుండ్రముగనుపా । తాళతలముదాకథ

రణిద్రవ్వి । రదియునిదియుగలసి యవనీజనులచేత । సాగరంబున్యాప్రశ
స్తిగాంచు॥

గీ॥ ధాత్రిజెరుచువారి దగ్ధంబుసేయక । నేలయుండుచంద్ర హే
ళినయను । డనఘులారసగర తనయులందరికికా । లావసానమయ్యెనడ
లనేల॥

క॥ అనిపల్కి వారిపిడ్కొ । ల్పినగీములకరిగిరంత భీమతరఖని।
త్రనికాయము ఖాయుధములు। గొనితొలిదెస మొదలు చేసుకొనిత్రవ్వి
రిలన్॥

ఉ॥ ఈగతిచక్రవర్తి సుతులేపున ద్రవ్విపురందరాశన। య్యా
గహయంబుగానక సమగ్రధరోద్ధరణా బ్జభృద్భుజా. భోగిసదృగ్రదాగ్ర
ములుభూమితలంబాగిమోవగ్రాలుశి । తాగమరుత్కజేందు విశదాంశు
విభాసితహాస్తినొక్కెడన్॥

క॥ పొడగాంచియగ్గజేంద్రుని । కడుభక్తింబూజజేసి కడిమిబ్బ
హద్భా । నుడుగలదెసకరిగియుద । త్తడినందు వెదకిరిబహువిధంబులవా
రల్॥

ఉ॥ వారువమున్మహీపసుత వారములారసికానకేగుచో। వారికి
దోచెనొక్కెడనవారితదానమరందనిర్ఝరో । దారసువాసనాభృతమ
దభ్రమరంబగు పుండరీకమ । న్వారణతల్లజంబుతరువాతతదంతిక భూ
ప్రవేశులై॥

చ॥ నతియొనరించియర్చలిడి నాగముపిడ్కొనియామ్యదేశమం।
చితగతిజొచ్చియాహయము జిక్కెడలాగెరుగంగలేకను। న్నతినిద్రవిక్రి
ముంగెలుచు నాజనువామననామవారణా । పతిపొడగాంచిమ్రొక్కిప్రి
యభక్తినిపూజలొనర్చిసాగరుల్॥

చ॥ దితిజదిశాతటంబునకు దీవ్రగతింజనివాజివార్తద। క్షితిజె
విదూరకున్నజను దెంచుచుదీనికి మార్దవద్యుతి । ప్రతికుముదంబునాకు
ముదవారణమొప్పగ దానిగాంచినం । స్తుతిబెరయించిపూజలిడి జొచ్చిరి
వారుణదిగ్వసుంధరన్॥

గీ॥ అచటహరినిగానకంజనాగముఁబోలి। యంజనాఖ్యనాగమతు
లదానసిరులఁదో । త్కటముల నెగడుటగని దాని । కర్చలిచ్చివినుతులా
చరించి॥

శా॥ దానింబాసిమహాబలాశనృపపుత్రవ్రాతముల్ జొచ్చి బా ।
ణానందారసిఁగానలేకరుగఁగన్వ్రైక్ సుధాంధోధివా । ర్దానింబోలినదంత
ముల్ధరణివా త్రంబుప్పదంతాభిధం। బౌనాగంబుదనూపరాజితసువర్ణాంగం
బొగిస్స్నుంగలన్॥

గీ॥ గంధవాహకోణ గజనపర్యనానర్చి శివసఖాశకరిగిసవనసైం
ధ । వంబునచ్చటచటపరికించిపరికించి । గానలేక రాజసూనులపుడు॥

చ॥ అనిమిషధామసామజచయంబుల కెల్లను సార్వభౌమమౌ ।
యనదగుసార్వభౌమ మనుహస్తినిగాంచిప్రదక్షిణించి వే । వినుతులొన
ర్చియర్చలిడి వీడ్కొనియచ్చటవాసిఫాలలో । చనకరుబంతరంబునకు
సాగిరుదగ్రరుపావిలోకులై॥

క॥ ఈకరణిసాగిఫాలా । లోకాశంజొచ్చితీంద్రడిలుచునె మకునె
డన్ । రాకొమరులొక్కచోఁగని । రాకాండంబునుదదంతికావనిసీమన్॥

సీ॥ శుభ్రత్యగ్రశరణమై శుద్ధతారకయోగముండెనా పటికంవుదం
డగ్రాల । రాగంబుభక్తవారముప్రోవబొంగెనా దలకెంజడలదళత్తళలు
జెలఁగ । సాగరాంగారాళిగ్రాగకొల్మలువిప్ప గడెగెనానరమోద్భుగనుల
వరల । సాత్వికశ్రీదెల్పునరణిశుభ్రమ్మృదూర్ధ్వపుండ్రకద్వాదశంబువెలు
గొంద । నొక్కమునిరాజుగ్రహములందుగ్రకరుని । పగిదితెరగంటినందు
భోపద్మనయను । చందమునవిధిశివమూర్తులందుసిమన్ । లాకృతినె
సంగుచున్న వారతనిగాంచి॥

ఉ॥ అద్దిరవాజిచోరుడిపుడక్షులకుంబొడగట్టెఁనినా । గ్రద్దరిపొ్రి
ద్దుపట్టిపెనుగద్దియమొద్దికిద్రోయుటొప్పువే । సుద్దులికేలనంచుపరశుప్ర
ముఖాయుధధారులై దెసల్ । బద్ధలువారనార్చిమునిపై నిగుడించిరిపె
ళ్ళుకై దువుల్॥

గీ॥ ఇవ్విధంబున సాగరులేపురేగి । కపిలముని మీఁద మోరుగులుగా రుకరుకు । కైదువులు నువ్వనవి కొండ గదియుతూల । ఖండ కాండంబుల య్యెదగ్ధాఘమహిమ॥

క॥ కనరెనసి బాసవాల్దార । కనుగొనలు విచ్చె శిఖిశిఖాజాతవి నూ । తనవిస్ఫులింగకోటులు । వనజభవాండావకాశ భాగమునిండన్॥

సీ॥ తోలుదోల్తశిఖలు జట్టలుగట్టితాకి సాగర శరీరంబులు గాల జొచ్చె । నావెన్కఁ జూతాఁకరమధికమై గ్రొన్పొగల్లగ నభాగంబెల్లఁ గప్పు కొనియె । నటుపిమ్మట నుజట చ్ఛటని నాదములతో పృథుకీకసావళుల్ప్రేటి లిపడియె । నాతరువాత కీలాతతుల్వాడి విల్చి గుప్పుగుప్పునమండి నిప్పులయ్యె । నంతషష్టిసహస్ర సంఖ్యాకమైన । బూదికుప్పలపింకు దన్నునివశే ల్యు । నగ్రభాగంబునందు తారాచలముల । కరణిను త్సేధమూతులై తా క్రాలుచుండె॥

క॥ తాపసులారజగత్పరి । తాపపరుల్పాపకర్మతనులదయాత్ముల్ । శ్రీపతి చే నాపద్వా । రాసారాంబుధిమునింగియడఁగుటరిదియే॥

మ॥ సగరుండక్కడ నంశుమంతుఁగని వత్సా నీ పితృవ్యుల్దివిన్ । జగ తిన్ శోధన జేసి భోగధర వాసంబుల్గనలై జొచ్చిరే । పగవారడ్డము వచ్చిరో యకటయశ్వంబిందు దేరైరినే । వ్వగ బాలైతిమిబొమ్ము తెమ్ము హరి నవ్వాలన ల్మదింగాంచుమన్॥

క॥ తడయంగారణమెద్దియొ । కడమ బడెన్ జన్నమకట గడువేగ మునన్ । నడచిపొడగాంచిమనతే । త్తడిదేలేరొరులునీవు దక్కఁ గుమారా॥

క॥ నావిని యూవినయశ్రీ । భావుండంశుమదభిఖ్య పార్థివసుతుడు । ర్వీవిబుధాశీఃకర్ముల । తో వెడలి నృపతికిన్ మ్రొక్కి దుర్దాంతగతిన్॥

శా॥ వాలుంసింగిణి కేడెమూని యొడలన్వర్మంబుగీలించి గా । ర్వా లీఢాహితఘూసపుంజదహనుం డారాసుతుండా పితృ । వ్యాళుల్దివ్వినగ తన్నముంగని సమగ్రాశ్చర్యచిత్తుండై । యాలో జొచ్చి నిరున్నతోన్న మితభాగానీకమున్గాంచుచున్॥

క॥ చనిచని రాజసుతుఁడుత్తా । ర్పునకున్మల్లటయు నటవిరూపాక్షముఁగ । న్గొనసమ్యోదానికాయన । ఘనపూజలుసల్పివినుతి గరవు చుబల్కెన్॥

ఉ॥ సామజరాజమజ్జనకజాలముఁ బ్రుచ్చునగల్చివార్వమున్ । దే మహిద్రవ్వియాడక రుదెంచిరి గన్పడ రేడనుంజిరో । యామఘవాశిజేపడి మహాధ్వరమింకటసాగుసేయనన్ । ప్రేమవచించెనగ్గజము పేశలభాషలతోదయాళువై॥

క॥ ఈతాపుగడచిచనుము । జ్ఞాతాప్తకులీనదారకుసత్యంబుఁగన । వ్వైతానాజానేయము । జేతోముద మొదవయాగసిద్ధిఘటించున్॥

ఉ॥ నావినినంతసింపుచు ధనంజయదిగ్గజముఖ్యసారగం । తావశపట్కదర్శన మొనర్చి సపర్యలు జేసిసంస్తుతుల్ । దాఁ వెలయించియమ్మొదటిదాని తెఱంగున నాడవించుగో । త్రాపభునందనుండరిగె రాజకిరీటధిశాతటంబునన్॥

గీ॥ అరిగితత్ప్రదేశమందధ్వరాశ్వంబు । నెమకిగానలేక నృపకుమారు । డవలకొంతదూర మటుబోయికపిలాభి । ధానహరినిహారిసతండుగాంచి॥

శా॥ కైలాసాచలపాళినాగసగ రక్ష్మాపాలపుత్రచ్ఛటో । త్తాలాంగోన్నతభస్మరాసుల లకార్దమ్యాగ్రభాగంబునన్ । గ్రాలంగన్గొనిదుఃఖసాగరమహా కల్లోలరేఖాంతరో । ద్వేలత్రాసితచిత్తుఁడైయనఘమూర్తిం దన్మునిగ్రామణిన్॥

క॥ డాసిప్రియభక్తితోసతి । జేసిపొగడెనిట్లుతండుసింధుశరధిమ । స్తాసీనసుధాంధస్సరి । దాసారోచ్చాలనోర్మికాత్యార్భటులన్॥

రగడ॥ జయజయమాధవ సద్వనమాధవ । జయజయహృత్ప్రియసతతోమాధవ । మామవకమలామలహృదయాలయ । మామవానుకంపామృతాకరాలయ । జననస్థితిలయచర్యాకరుడవు । ఘనకాదికకంజవిభాకరుడవు । విధిముఖసుర సేవితచరణుండవు । వ్యధబాపెడికరుణాచరణుం

డవు । నిన్నెరుగకదుర్నీతినిమాదార । లున్నతకాయములుడిగిరిసాదర। మన్నించుమునను మన్మథసుందర । వన్నుతపృష్ఠస్థలధృతమందర । కావ గలేవా గమములభవభవ । దానవమత్తిదయగనుము సువిభవ । భా నూడుపబింబశ్రీలోచన । దానవగర్వవితానవిలోచన । కపిలాకారము గన్నమురారీ । విపులాపతివై వెలసినశౌరి॥

క॥ నుడిక్రైదువదోరయంశవు । టొడయండగుకపిలయమినిహృ దయాబ్జమునం । దిడిభక్తిమరియునీగతి । నుడివెసగరపౌత్రకుండనూ నార్భటులన్॥

ఉ॥ తానుతరింపనెంచి విదితంబుగకర్దమునాత్మనాధుసు । జ్ఞాన మెఱుంగజేయుమని సన్నుతిజేసిననీకుగల్గుపం । తానముచేకృతార్థతను దాల్చెదవంచనిబోవబుట్టియ । మ్మానిని దేవహూతినిరమాధవధన్యను జే సితెన్నగన్॥

మ॥ అనిమిత్తంబుగరావణుండలిగిదివ్యాస్త్రాళిసీమీదరు । వ్విన నప్వీరుని ముష్టినొంచియు భయావేశంబునొందించిముం । దనిలోరామ సమాకృతిన్ దునిమి వ్రేయంజాలుదునిన్నుబా । మ్మనవేఘోరనిశాటదు ర్జయ భుజాహంకారనిర్వాహకా॥

చ॥ కనదఘలేఖనాకలన గాఢరయప్రకరాంగుళీమిళ । ద్ఘనత రలేఖినుల్ముఖవిఘాతముల్లైచన చిత్రగుప్తము । ఖ్యనిచయముల్నిరు ద్యమత దాలిచిరట్టిపితృవ్యులెల్లమీ । సునిశితదృక్శిఖిన్ బడగశోకమి కే లనటంచుమానితిన్॥

క॥ తనకర్మముతనకనుభవ । మెనయకపోదెంతవారికేనియునే నీయనుమానమువాసితినో। యనఘానన్నాదరించియనుపుముగరుణన్॥

క॥ అనిపొగడగగపిలాహ్వయ । వనజాక్షుడపాంగవీక్షవానింగ నియో । జనపాలతనయకులపావనుడపుభక్త్యాగ్రణివిశుభమునీకేసగున్॥

ఉ॥ రక్కసులుద్భవించిరి ధరాస్థలిసాగరులై జగంబులన్ । జిక్కు

లవెట్టిసాధులకు సేగిఘటింపగజేయనింద్రుడీ। జక్కినిదెచ్చియిచ్చుటెరఁగక్విడిపోనిటువారువచ్చిమ। ద్దృక్కుఠినాగ్నికీలలకు దేహములాహుతులిచ్చిరక్కటా॥

చ॥ జగదపకారులీకరణి జావకయుండినసాధుకోటికిన్। దిగులెటుదీరుసర్వజగతీస్థలినేగతిసేయుమూరుని। వగపికమానుమయ్య సుజవాహినిసేకముసోకిగాకవీరగపదిపంధిపీటెసుఖమానరుసూనరపాలబాలకా॥

క॥ నీతాతధృతిఁజతభవా। నీతాతముఖంబుకడమ నిండించుని కన్। పీతింగొనియేగుముని। పీతిన్నిముక్తిఁదాప్తి నెడపకువత్సా॥

గీ॥ గరుడగంధర్వముఖ్యాంశకలితమూర్తుఁ। లందొకండైనకపిలుండిట్లనినపిదప। గరుడగంధర్వముఖ్యఖేచరులువిరుల। సోనమునినృపసుతులపైఁజొనిపిరలరి॥

సీ॥ జఠరానలునకునిషాదాళిజాలకఘులి గజంబులగొన్నబలఁడు తుండు। నిదిమహాయుధముగూడదువంచనముసేయ ననిపవికీకవైచినఘనుండు। త్రోటిపుటంబుచేదోయధిజలముదాల్చి సుధాంతికాగ్నినార్చినసమర్థు। డలఘుఘోరాహిస్ఫటాంచలంబులు ద్రొక్కియమృతంబుగొన్నసమరవిజయు। డగుఖగప్రభు డరుదెంచెసగరుదరుణ। కిరణగణములచేదిగంతరములింగి। లికపుగ్రొంజిగిగావింప లేఖపీధి। దలనెలవెలుంగునెరపన త్తపసికడతు॥

క॥ అరుదెంచికపిలదేవుని। చరణంబులకెరగినిల్వ నంయుమౌవిహాగే। శ్వరుతోడనిట్లులనియెను। ధురభవ్యామృత మరందతుల్యోక్తులన్॥

ఉ॥ ఈతనిచిత్తసంశయము తెల్లనుబాపివితానవాజితో। నీతరినేగవీడ్కొలుపు మీనగరాధ్వరమింకపూర్ణమా। గాతవృధామునీశుణశిఖావదు దగ్గతరాచ్చికిందను। వ్రాతములిచ్చిరాముసుజ వర్యునిసూనులుదుర్విధానులై॥

క॥ నావినిఖగరాజావను। ధావిభునందనునిజూచి తజ్జనుతా

గం । గావారిభూతిగలియక । నీవారికిదివిఘటింపనేరదుసుమ్మీ॥

క॥ అనవిని రాజకుమారకు । డనియెన్ దివిజాపగా సమావిర్భవ
ముస్ । వననిధులునిజజలత్వము । గనుటకుగారణముదెల్పగదే ఘన్మదేవా॥

గీ॥ తండ్రులకునుదిలోదవిధానమాచ । రింపనూహించి వెదకి వా
రిగనలేక । వంతగుందుచునుంటి నావంతకరుణ । నానతిగ్రహించితత్క
థనానతిమ్ము॥

మ॥ అనినన్ శౌరిశతాంగుడిట్లనియె మున్న జ్జాతుడింద్రావనం ।
బున కైయాచనకాంక్షియై మును పదంబుల్మూడు వైరోచనిన్ । దనకిమ్మా
ధరనంచు వేడనతడీధాత్రీతలం బెల్ల గ్రక్కునగోవిందుడుగొల్చె నొక్కడు
గుగా గోత్రేశపుత్రాగ్రణీ॥

ఉ॥ మిన్నడుగొండు జేయుతరి మిక్కుటమైయదిసత్యలోకపుం ।
దెన్నునకడ్డమైనవిధి దేవుడుభక్తితదంఘ్రిపాద్యమీ। గన్నదియైమరుత్ప
రికగడ్డగనిల్చిబొగడ్డకెక్కెవి । ద్వన్నుతగంగనాగను సదానదదున్న
మదచ్ఛభంగయై॥

ఉ॥ రెండవభానుడోయనధరిత్రిప్రియవ్రతుడేగుచోరథా। ఖండత
రారినేమి మొనగాడినచోటులుగా వెయీమహా । కాండధులేడుదత్కన
దగాధజలంబులగాలకేయులు । ద్దండపరాక్రముల్ ద్రుహిణదత్తవరస్మ
యులుందురేపునన్॥

క॥ ఆయనివేసులుపగలీ । తోయధిలోడాగితటముదొరసినిశలు
ఘో । రాయుధములమునిపాళిక । పాయంబులు సేయుదురు గృపావిర
హితులై॥

ఉ॥ ఆకథయెట్టిదన్నవిను మాదియుగంబునగాలకేయులు । స్త్రీ
కరమూర్తివృత్రుడును బేర్చిమరుత్పతిదొట్టివేల్పులన్ । నాకముజేర
నీకగహనంబులకుందరుమంగృపామతిన్ । జేకొనికావుమంచుసరసీరుహ
సంభవుజేరిరాదటన్॥

క॥ వారజునిపొగడికరుణా । పారీణసురాహితులను బరిమార్చ

విధం। బేరీతియొవ్వ త్రౌసురమారణమెట్లగునో దెల్పుమాయనబలికెఁ॥

చ॥ సరసవరస్వతీతటనిశాంతుఁడు శాంతుఁడిలఁ దధీచినా। బరగి సమానికల్పముల పారములాతనికయ్యెనాకళా। కరుకడకేగికీకసనికాయముఁ వేడిననిచ్చువైరిభీ। కరములగుందదస్థులుజగంబునవజ్రముఖాయుధంబులై॥

క॥ అందుశితవజ్రధారన్। మ్రిందించున్వృత్రుస్సీయమరపతియనవా। రందరుజనిరిదధీచిగ, నందామరసభవుశాసనంబుననెమ్మిన్॥

క॥ జాసినమస్కారంబులు। జేసికడుంబొగడమాని శేఖరుడుగ్రా। భాసురమతిమైయాగ। గ్రాసులమీరాక కేమి కారణమనినన్॥

శా॥ లోకారాధ్యశచీట్పురస్కృతసురల్స్తోత్రంబులైవచ్చిరాలో కింపన్నిముదేవతాహితము నాలోచించిమీకీకసా। నీకంబుల్ దయసేయుడన్నమది నెంతేసంతసంబంద్ధీ। రాకల్పుండు తపోధనుండువిడిచెం బ్రాణప్రతానింబిలన్॥

గీ॥ ఆతనియస్థివితతులమరులు జేకొని, రాయుధములుగాగనందునుజ్వ। లంపుటెముకత్వష్ట్రియనుశిల్పిధారాశి। తంబుగానొనర్చెశంబమురిపి॥

క॥ ఆదంభోళింగొనివృ। త్రాదిత్యవిరోధినార్చెనమరపతిజయ। శ్రీదనరకాలకేయుల। పైదేవానీకమడరె పార్థివతనయా॥

మ॥ వరదివ్యాయుధపాళిదాచిమరుద్వారంబుబీరంబుతో। దరుమంగయ్యవునేలబాసియధికత్రాసాత్ములయియర్ణవాం। తరదేశంబునగాలకేయమనుజాదశ్రేణివేడాగియు। ర్వరకున్నేలరుదెంచిద్రుంచిరిజనవ్రాతంబులంగ్రూరతన్॥

సీ॥ విద్యాతపశ్శీలవిలసిల్లువిప్రకుంజరులకారణమునజగముతెల్ల। ననపాయముగసౌఖ్యమనుభవింపుచునుండు నట్టివారినిరోసియార్చిలోక। ములకపాయమొనర్చి వెలయుదమనికాలకేయాసురులుపగలీయుదధిని। డాగిరాత్రులుధరా భాగంబునకుబిట్టు జనివశిష్టాశ్రమంబుననునాట।

తొంబదేడ్వురచవనువనంబులోన। నూర్వురనుభరద్వాజుచేర్వనిరువ। దుంద్రబారులఘునకోవిదులనుమిఱింగి। భానవాళ్లోరలనుభీతిబరచుచున్న॥

క॥ జన్నము మొదలగు సద్విధు । లన్నియు నున్నయగు టెఱిగియ మరాధీశుఁ । మున్నిడుకొని వైకుంఠపు । దెన్నునబడిననిరినకలదిక్పాలాదుల్॥

గీ॥ ఏగి వైకుంఠనగరిసర్వేశుగరుడ । రథుని వైకుంఠు విష్ణు నీరజదళాక్షు । దైత్యభంజనుఁ గాంచి కృతప్రణాము । లగుచు నుతియించి రిట్లని యఖిలసురలు॥

మ॥ అనిశుత్కారములయ్యోమా త్రిపుర దైత్యశ్రేణులందుఱించునా । డనలాలోకునకంచునోనిశి చరాహంకారనిర్భేదివై । జనుసీయూర్పులటంచునోకడలిడించం బ్రాగ్వచఃపాళిద । ద్దనుజానుచ్ఛటతో వెలార్చవె ముకుందా ఘోరమీనాకృతిన్॥

మ॥ నగమన్బింగరమీవుపృష్ఠమున మున్నాటించియాడించిచి । త్రగతిన్ రత్నగజాశ్వధేన్వమృతపూరశ్రీముఖంబుల్వదా । న్యగరిష్ఠుండు నదీశుడీబడసితౌ నాస్తాళితో నుర్వరన్ । దగదేదానరిగానికీసరణి సుత్రామాది లేఖావనా॥

సీ॥ ఘననిజామలకీలిఁ కలధౌతదండాగ్ర కలితవాసవనీల గుళికయనగ । కనకలోచనుగుండె కాయవిఱ్ఱిల్లగదవ్వులోన్నను కాలమానసపుదునుకయనగ । పాటితరత్నగర్భాగర్భదేశ సంగ్రస్తమైనరాహుముస్తయనగ । దంష్ట్రాప్రదేశమందారశాణాంచలంబున వెలుఁగుమిళిందపోతమనగ । ప్రళయవారాశిమగ్నోర్వరావలయము । గోరనిడియెత్తవే ఘోరఘుర్ఘురారవ । రావదీర్ణాబ్జజాండకరండతలుడ । వగుచుపింభవరాహనాగారివాహ॥

ఉ॥ కన్నకుమహాభుజంగ సముత్కటినసోకులరేడునీనఖా । భ్యున్నతిచేనడంగుటరణోద్ధతినీవుగతాసుజేయుటే । మున్నెభవన్ముఖజ్వాలనభూరిశిఖావళిఁగ్రాగిపెద్దప్రమా । గన్నిడెగాకకీటకమునైపడిమానవకేసరీహరీ॥

ఉ॥ నీచరణంబు బెంచి ధరణింగొనుచోపదనూపురంబువ్రా । త్రా
చలమయ్యె మింటభప దంఘ్రిగదించిన దేవతాసప । ర్యోచితపుష్పపాళిగ
నుడూత్కరముల్ వరపాద్యవారిగా । ద్యోచరవాహినీలహరి దోఁచె విలో
చనజాతమోచనా॥

మ॥ శివుచేతన్విలుఁ విద్య గైకొనుచు బంచెన్రాజహంసాళిము ।
న్నవిరంధ్రంబున నాఁడితీరియిపుడా హారాజహంసాళినే । డవిరంధ్రంబున
బంచుటబ్బురమె యంచాదిత్యులాడంగ రా । జవితానంబున డంప వేద్విజు
డవై సంగ్రామరంగంబునన్॥

సీ॥ అలసుమిత్రానంద నాప్తినాఁడును నేఁడు కౌశికావనము జక్కఁగ
నొనర్చె । రహినిధర్మజ్ఞధర్మంబు నాఁడును నేఁడు గుణకౌశలమున వర్ధనము
వల్చె । రమణీయగోజానురక్తి నాఁడును నేఁడు నలరె శ్రీజనకులకల్లుఁడగుచు ।
వితతాంబునిధిభంగ విహృతి నాఁడును నేఁడు నతులితకాండసంగతి దనర్చె ।
నాఁడు నేఁడచ్యుతసమాఖ్య వీడదయ్యె । నాఁడు నేఁడును విక్రమోన్నతి నటించె ।
క్రీడగావించె దెలిదీవి నాఁడు నేఁడు । గ్రాలె సాకేతమున నంద్రు రామ నిన్ను॥

మ॥ దురహంకారికుభృత్పరంపరభవద్దోశ్శీరదంభోళిని । స్ఫురవ్ర
త్తింబడదోన్నప్రీతి నవినిస్తుల్యాప్సరోయోషిదు । త్కరవత్క్షోరుహశైల
పత్రతతులంతన్వ్రాలెహా చిత్రమై । బరగుంబోయనినిన్ను మెచ్చుదె మురు
ద్వారంబునీలాంబరా॥

మ॥ బలవత్కంసముఖక్షపాచరతమువ్రాతంబులన్విక్రమ । జ్వాల
నార్పించాలియించి నిర్మలదయాసారప్లుతిం గీర్తియ । న్గలమాళింగడగ
ట్టుదాక బెరుగంగా జేసితదప్తి కా । స్థలిగట్టించ వెశాక్వరాసురుని శీర్షంబైం
ద్రదిసూతాగ్రణీ॥

శా॥ తేరాలూరుపులశ్వముల్స్వరముని దేహంబుగా వించికా । మా
రిన్బ్రార్థిజయాప్తికన్నిముసుబుద్ధాకారివై నీసుతుం । డైరాజిల్లురతీశుతో
డుగొసితద్వాత్వంగనాశీలచ । ర్యారూపాలఘుసాలతల్లజమువ్రయ్యం జే
యవే కేశవా॥

మ॥ హరిధారాదళితక్షమావలయ నిర్యత్పాంసుసంఘాతసం ।
భరితాంభోజభవాండకోటరమిళ ద్గాఢాంధకారచ్ఛటా । తరసందీప్త
కఠోరతాపకభుజా దర్పాగ్నికీలాసము । త్కరతప్తోగ్రతురుష్కరాట్కుల
భరేఖాకల్కి రక్షింపవే॥

సీ॥ అధ్వరంబునకుమున్నంతరాయములూన్చు యజ్ఞఘ్నదైత్యా
గీటడచినాడ । వండజాతములుజరాయుజంబులుస్వేదజములు ద్భిజముల
ననమరునాల్గు । చందంబులగుభూతచయములరక్షింపుచున్న లోకావ
నునిన్నువేడి । విన్నపంబొక్కటి వినుపింతుమికవిప్ర పోపద్రవమువిను
మురగశాయి । కాలకేయులధికకాయులుపగలెల్ల । వారిదుర్గబలమువ
లనజలధి । నుండిరేలువెడలి చండాట్టహాసులై । బ్రాహ్మణులవధింపపా
లువడిరి॥

ఉ॥ ఎట్టిదురాత్ములైన మఱియేయుగవేళలనేనివిప్రులం । బట్టివ
ధింతురేయకట బ్రాహ్మణహింసవినంగనయ్యెనీ । పట్టునసాధులైనద్విజ
పాళికికీడుఘటింపధాత్రిదా । బిట్టుగగాసియయ్యెగడుభీతివహించెజగంబు
లన్నియున్ ॥

ఉ॥ ఆవిధమెట్టులన్నసకలాగమముల్ ద్విజకోటిదాల్చిన। ద్భావ
ముతోతదుక్తసుకృతక్రియలొందుట జేసిహవ్యక । వ్యావళిదేవతల్పిత
రులందరుదృప్తివహింత్రుదానసౌ। ఖ్యాపహమైజగత్సముదయంబలరున్
ముచికుందరక్షకా॥

క॥ కావునవిప్రోపద్రవ । మీవునివారణమొనర్చి యెల్లజగము
లన్।గావుమునేడుగృపామతి। నావుడుహరియానుధాశనచ్ఛటననియెన్॥

స్రగ్ధరా॥ కాలాంగుల్గాలకల్పోల్గతనహృదయుల క్కాలకేయక్ష
పాటుల్ । జ్వాలావద్భూరిశౌర్యోజ్జ్వలనిధిసదనుల్వానినోర్వంగరాదు ।త్తా
లాంభోదర్ధమధ్యస్థలచరులగుటన్ దచ్ఛరద్యంబుపుల్లి । ర్మూలంబైపో
యినన్వేబాలియుదురవనింబూర్వగీర్వాణకోటుల్ ॥

మ॥ ఘనపీరోన్నతమూర్తి కుంభభవుడా కల్లోలినీస్వామిజీవన

మొక్కమ్మడిద్రావనోపునతనిం బ్రాధిఁంపుడియన్నదే! వనికాయంబపు జేగుదెంచినతులవ్యాతాపిభుజామ్మనినా ! ధునకర్పించినతించిరామరధు నీతుంగోర్మిగంగాభళిఁ॥

సీ॥ భోగివైవిలసిల్లు బూరుతితౌమహా భోగిగాభూతలంబునను నుపవె ! జీమూతపథమాని చెన్నుమీరినవింధ్య జీమూతమునడంగ జేసి మనవె ! పుణ్యజనులనార్చిపొట్టనిం చెడిఘోర పుణ్యజనులమ్రింగిపొల్పు గనవె ! కమలాధిపనుతౌశగరము ప్రకాశించికమలాళికిడవె నిష్కలుష వృత్తి ! నిగమనంతానములకుర్వినీముఖంబు ! నిగమమైయుండ నెగడవె నిర్మలాత్మ ! నీమహిమవర్ణనముసేయ నేర్తుమేమ ! హన్ననాధసుధమిఁ ణీప్రాణనాధ॥

క॥ అనియమరులెల్లదనుబొగ ! డినగాంచిమునీశ్వరుం డడిగెవా రలనే ! పనికైవచ్చితిదిచ్చటి ! కనుచుబ్రియాళుడయి గడునియప్రచు రోక్తిఁ॥

మ॥ అమృతాంధశ్చటగాలకేయకృత లోకాపత్ప్రపంచంబశే ! షమెరింగించియుదీనిబాపగహృదజ్ఞాతంబునందూహమీ ! రమరింతేని మునీంద్రతుంగతర భంగారావసంఘాతసాం ! ద్రముసంద్రంబికద్రావిదు ర్భరజగత్సంతాపముల్మాన్పమీ॥

క॥ జలదుర్గంబుడిఫ్రొయిన ! వెలువడుదురుకాలకేయ వీరాదికదై ! త్యులువారింబొరగొందుము ! గలన్ దివ్యాయుధ ప్రకాండప్రహతిఁ ॥

గీ॥ అనినవింధ్యవిమతుడట్లుసేయుదునని ! యమరవరులకెల్లహర్షమూర ! బల్కివచ్చెఖచరపన్నగామరయతు ! గరుడముఖులతోడకడలికడకు॥

సీ॥ దీర్ఘకల్లోలాపదేశహస్తంబులువిడిబడిపలుమారువిచ్చివిచ్చి! తటదేశకలితావదాతడిండీరబృందచ్ఛద్మమునబిట్టునవ్వినవ్వి ! వల్గచ్ఛకులకులవ్యాజంబుచేనిరంకుశలీల నాల్కలుగ్రోసిగ్రోసి ! పటుతరారావ

దంభప్రచారోద్వృత్తిచేనట్టహాసంబుచేసిచేసి । చివరనిరుదిక్కులకుసా రెజెప్పిజెప్పి । నుల్లనెపమునవక్రతజూపిజూపి । వాహినీశ్వరుడవ్వింధ్యవైరినాత్మ । నరకుగొనకుబ్బెజడులకీనరణితగదె॥

క॥ రంగత్తరంగములచే । నింగినొరయుచున్నవార్ధినియమిప్రాంద్రుడుచే । ర్వంగనిపలికెఁజడధీ! పొంగకునీత్రుళ్లడంచిపుత్తునిజముగన్॥

ఉ॥ బాడబతీక్షణంబుబహుభంగులమజ్జలమార్పలేకదా! క్రీడవహించిలోఁగె యరరేయనిత్రుళ్లెదవేమొ యిప్పుడీ । బాడబ తీక్షణంబికకబంధమశేషము బాపినిన్నుపె । న్బీడుగజేయుజూడుమని భీమముఖంబతఁడూనెనుగ్రతన్॥

క॥ ఈచాడ్పునమొగముగ్రత । వాచంయమిదెరచినకలవార్ధిజలంబుల్ । వీచీసంఘంబులతో, వై చెన్నిజగర్భమునసుపర్వాలువ్రుగఁడన్॥

గీ॥ వదనమొగిబెంచి మున్నిటివారినెల్ల । నానజాలకతిరుగునాయనఘునుండె । వదనమొగిబెంచిమున్నిటివారినెల్ల । నానెఘనుడీతఁడేయనిరమరులెల్ల॥

శా॥ యాదఃపాళులుగాలకేయముఖ దైత్యశ్రేణివేదోచెళా । నోద్వాంభోనిధియందురక్కసుల నత్యుగ్రోద్ధతిం దాకెన । య్యాదిత్యప్రకరంబుగ్రొమ్మెరుగులనోన్యాయుధశ్రేణులం । బ్రాదుర్భావమునొందిచీకటుల నాపాదించెవిశ్వోద్రేకిన్॥

శా॥ ఆమొంబోమొదముగ్రసంగరపు చర్యల్ జెప్పనేలయ్యదై । తేయానీకినిలోనకొందరు మరుద్దివ్యాయుధశ్రేణిచే । గాయంబుల్ దెగిగీటణంగిరి కడుంగంపించివేకొందరా । హాయంచున్పణిధాత్రిడాగిరిగతాహంకారులయిరాసుతా॥

క॥ చటులయుగాంతాగ్నిక్రియ । ఘటజాతుడుగ్రోలెనీనకలవార్థిజలం!బిటుగోత్రాదేవికిని| ప్పటవర్తనమెనసెనసినుపర్వశ్రేణుల్॥

మ॥ యతిమూర్ధన్యునగస్త్యువారుగనియా యాదోనిధానంబుపం । తతసీవాక్కృతసత్వమైవెలయగానర్కరి క్షమాటొప్పనే । మతియం

దక్కఁటికంబునిచ్చియఖిలాంభశ్చారిసంఘాతసే । వితమానట్లుగనేతదబ్ధికిముద్వాన్నిరపూరౌఘముల్॥

క॥ అనవుడుమునిపల్కెఁసుధా । శనులారమదీయజఠరచటులా నలుచే । నినికెరుదవ్వాన్నిరమ । వనిదానిఁగ్రమ్మరంగబడయఁగనేరన్॥

మ॥ అనిపల్కన్వినిదేవతానికర మయ్యబ్జాసనుంజేరియో । యనఘాదైత్యులొనర్చురాయిడికిఁ గుంభావిర్భవున్వేఁడిజీ । వనపానంబొనరింపజేసితిమహా వారాసిబీడయ్యెన । త్వనికాయాశ్రయమాటదానిమగుడన్వారాన్నితిన్ గావింపుమా॥

మ॥ అనివాక్రువ్వఁగళాకళావతిమగండాదిత్యులంగాంచిపా । వనులారావనరాశికింజలముజేర్పన్ద్రిదుపక్యాయవే । ళనయోధ్యాపురిలోభగీరథన్రుపాలుండాణిబాల్యావనా । యనదాసాగరునవ్వవిత్రులనుజేయన్సత్రపంబూనెడున్॥

క॥ చన్నతనవారిఁబూడిదె । దిన్నెలపైఁబాఱధరకుఁదెచ్చునతండా । మిన్నేటనిమున్నిటికి । జెన్నారున్నాడెనీరు చింతవలదికన్॥

క॥ అనిపల్కియాపితామహు । డనిపెన్నచనాంధులనుధరాధిప సుతతే । జనిగానినీదుపితామహు । మనికికిజచుమనినయాంశుమంతుమ ప్రీతిన్॥

గీ॥ గరుడునకుమ్రొక్కివీడ్కొని ఘనతరాశ్వ । సహితుఁడైసర్వ రథినీవిసరములండ । బాయకేతేరసగరభూపాలుపాలి । కరిగిజరిగినవిధములాయనకుఁజెప్పె॥

క॥ అనిచెప్పినశౌనకముఖ । మునులందరమందహర్షమునసత్య వతీ । తనయాంతేవాసింబా । వనగుణవనరాశినవలివతనమునగన్॥

శా॥ మంధానాచలధీరధీరజనసన్మానానుకంపోజ్వల । త్సంధానందవిచారచారణగణోద్యద్వక్త్రనిర్యన్నుతి । గంధారావవిహారహారదరహీరగ్రావపశ్రీయశ । స్సంధానైకదిశారవారదసరోజాతాయతాలోకనా॥

క॥ కల్పసదృశవితరణసం । కల్పభవజనకనిరస్తకల్మషసుగుణా॥

కల్మషహేంధానశిఖీ । కల్పసమగ్రప్రతాపకప్రమాలాపా॥

ధృతివృత్తము॥ మురాదిరిపుభంజనా మునిహృదంబురుడ్రంజనా । సరోజదళలోచనా సగసగక్షణాలోచనా । చిరంతనవచశ్చరాచిరతగాదరక్షేచరా । కరీంద్రభయపాకహాక విజనామరానోకహా॥

గద్య॥ ఇది శ్రీమన్మేధా దక్షిణామూర్త్యష్టమూర్తి దాక్షిణ్యాను
లబ్ధ కవితాసార సుభద్రాంబికా పిచ్చయామాత్యకుమార
తురగాన్వయ పయస్సాగరాభోగతా రాజార వేంకట
కవిధీర ప్రణీతంబైన నిర్వచన భగీరథోపాఖ్యా
నంబను మహాప్రబంధంబునందు
తృతీయాశ్వాసము.

---

శ్రీవాసుదేవాయనమః.

శ్రీకరభీమాన్వయనీ । రాకరశశిరామదానసహర్షోదస్వ । ద్రాకాశశాంకమండల । శోకాప్తాంతరవిహారిగుడిపూడిహరీ॥

గీ॥ అవధరింపుము శౌనకాద్యఖిలమునుల । గాంచిసూతుండుపల్కె సాగరులుకపిల । జటిలచటులదృగింధానవటితహేతి । పటలినీరాటతాతతోప్పాత్రకుండు॥

చ॥ పలికివచించె వెండియు నృపాలపురందరదేవహూతిగా । డిలికొమరుంబ్రసన్నునిగ దేల్చితిసంస్తవమాచరించిని । మ్మఃలహృదయుండవై తురగ రాజము జేకొనిపొమ్ము జన్నము । జ్వలమతినాచరించును రసావిభుడంచతడాడిపంచినన్॥

శా॥ రానూహింపగవచ్చెనచ్చటికిగీర్వాణాభినంద్యుండహో । ప్రాణద్రోహిఖగేశ్వరుండతనితో నావానినన్జూపిదు । ర్మానుల్వీనిపితృవ్యులందరుమదుగ్రక్రోధబహిర్జ్వాళిన । మేనుల్వైచుటకాత్మగందునితనిన్ నీవాదరించన్దగున్॥

క॥ అనిపల్కి ననునుగనియా । యనయనియెన్ నీపితృవ్యులందరు దివికిన్ । జనరేబూడిదెదిన్నెల । ననిమిషనదిముంపదేని యవనీశసుతా॥

ఉ॥ కానతపంబుసల్పి త్రిజగన్నుతయాపతగాధిపాశ్వక । న్యాన దినీధరిత్రి గదియంగనొనర్చి భవత్పితృవ్యసం। తానశరీరభస్మపువితానము ముంపగజేసివారిని । వానగభేదివీటికి రయంబునబంపుమటంచుపిమ్మటన్॥

క॥ కల్లోలమాలికంబువు। కల్లగజన్నట్టివిధము గంగామహిమం। బెల్లవివరించిపంపిన । మెల్లనపార్శ్వంబుతోడమీసన్నిధికిన్॥

క॥ చనుదెంచితి ననిచెప్పిన । జననాథుడగాధదుఃఖసాగరవీచి। స్మనిగిమహామూర్ఛాబం । ధనుడైతుదిదెలసి యలసితానిట్లడలెన్॥

ఉ॥ అక్కటజక్కదొంగయితడౌననియామునిమీదికేగి। యామె క్కనసేతలూన్పమదినించుక సైపకరోషవహ్నికిన్ । గ్రక్కునబట్టెనాహు తులగాదమునందరధాత్రిప్రాణముల్ । దక్కనెబానవాల్గొరల దాకిన దుష్టుల కేమిసేయుదున్॥

చ॥ తొలుతటిపట్టిదుష్టుడని దూరధరిత్రికిద్రోచియీసుతా। వలి గొలువన్ ప్రభుత్వవిభవంబువహించి మహాశ్వమేధము । జ్వలమతిసేయు చోనవన వాజిదొలంగినదానికైహహా । హళిజనకూలిరారకపిలార్యదృ గగ్నిశిఖాచయంబులన్॥

సీ॥ సప్తతంతుహయంబుసాగిపోవగఖలుండు దెవ్వడో దాహరియిం పనేల । హరియించితేనేమి యయ్యశ్వచోరకుం డున్నతావెరుగరాకుం డనేల । గనరామి కేమితక్కరుడాహుమాయిని కపిలార్యుచెంగటగట్టనే ల । గట్టిననేమాయె గట్టల్కమత్సుతుల్ తపసిముర్చ్చనిబిట్టదవులనేల । దవిలితేనేమితగుశిక్షతాపసుండు । పలుపకందరిసిజనేత్రజనితదహన। శిఖ కుశలభవ్రజములుగా జేయనేల । దప్పనేవిధివిధికైనధాత్రిలోన॥

చ॥ భృగుకరుణానులబ్ధసుతబృందము పస్మయిపోయెనెట్టులీ । జ గతిభరింతుప్రాణములు సాహసవృత్తికిజొచ్చిమానిచే । దెగిరకటాడు రాగ్రహగ్ధతింగడు గ్రొవ్వినహానిరాదె । పన్నగవిభుశాయికేనిదృహిణ

ప్రమథేశుల కేనిబిట్టుగ౯॥

ఉ॥ రాయను నామనంబినుము రాయను వ్రీలుదువంతమ్రిందినా । రాయనుమానికింత కనరాయనునన్ను శుగబ్ధిద్రోచినా । రాయనునేరిది క్కుఖళిరాయను బానితి రేతనూజులా । రాయను జేసి తేయిటు హరాయ నునెక్కడ జొత్తురాయన౯॥

క॥ అనివిలపింపగగనుగాని । దనకులగురుడిట్టులనియె ధాత్రీశ్వ రసీ । వనిశంబువగ చిప్రియనం । దనులం బ్రతికించె దేవ నరుటిది మేలే॥

క॥ వగపాకకొన్నాళ్లుసుఖం । బుగనుండుటకొన్ని నాళ్లు భువిజీ వునకు౯ । నెగడుకలకాలమేకం । బుగనుండునె వేధకైన భూపాలమణీ॥

ఉ॥ కౌశికువక్రిబోధవిని గాథరుష౯ తనుజాళినందరి౯ । దాశ రుడై వధించెపసుధాస్థలిమిత్రసఖుండుమన్ననో । దేశమునందుశోకముగ డించియు జేసిన దేమిభూమిభృ । త్కౌశికవంతపెడ్డొకని వంఘుంబుసమా ప్తమొనర్పు మొప్పగ౯॥

గీ॥ ఇటువశిష్ఠుడాడనిల రేడుశోకంబు । మాని మ్రొక్కి శేషమఘ ముపూర్ణ౯ । మునగోన ర్తుమానిముఖ్యతద్వత్నసం । శీలివగుముబుత్వి గాళిగూడి॥

క॥ అనవుడువశిష్టసంయమి । యనఘుత్వి౯ క్వాళిగూడియజ్ఞము స్వాహా । స్వనపూర్వ కాహుతులతో । దనరించుచునుండె శిఖలుదహ నంబీన౯॥

క॥ అంకురితముపిమ్మటనువి । శంకటశిఖలాకసమున సంధిలగ ప్రవర్గ్యాం । కితుడై వహ్ని శుభా । లంకారప్రభ నెసగెక ళాధరు పెన్న౯॥

సీ॥ నవ్యసుధాసమానపుటోగిరపు ముద్దపెనువరా సేయంగదినె డువారు । ధాన్యద్రవిణరమాధాములయి లేమికళ్లాలిని ల్వోడలించి దోలు వారు । మణిమయాభరణకోమలదుకూలములచే పూటకొక్కొక చెన్ను బూనువారు । రహిపుత్రపౌత్రపరంపరాయితవృత్తు లెనసిసంతసము వ హించువారు । స్వకమనోరధమునకంటె శతసహాస్రి । భూరిఫలములు

గోనిరాజుబొగడువాడు । గానిగానంగరాడాముఖంబునందు । మందున కునైనఫలహీనమానవుండు॥

మ॥ వసుధానిర్జరులొక్కకోటి భుజియింపన్ ఖంగుమన్మ్రోత్రిశబి । శైపసగన్ జేసెడిగంటనాదెటవులే కేపారెనయ్యశ్వమేధనవా । హస్నము దాయమందుగడుజిత్రస్ఫూర్తిన్ దద్భూమిపా । లసహస్రాత్మునికల్మియింత యని తెల్పన్ శక్యమే యేరికిన్॥

శా॥ సాంగామ్నాయవిదుల్ సమగ్రకవితా సంగీతసాహిత్యవి । ద్యాంగీకారులుశంకరాచ్యుత సపర్యాలోలురార్యస్ఫుటా । సంగుల్గానికళాపిహీనులమతుల్ సన్మేతసుత్సభా । రంగోద్భాసి సదస్యులం దెసగ రారా యెంతశోధించినన్॥

క॥ కనకేష్టికాభిరామం । బనఘాష్టాదశకరమిత మగుచుజతు స్ర్సి । త్యసిధాన వైతురగస । వనవేదికదనరెగరుడపతగాకృతినై॥

సీ॥ విధ్యుక్తసరణిని మేధ్యాశ్వబంధన బంధురంబైనయూపంబు చుట్టు । పాలాశములు నవైల్వంబులుమరియు ఖాదిరములునాటేసి దేవ దారు । మయములు రెండుశ్లేష్మాతకంబొందు యూపము లిర్వదొక్కటివ రుసనిల్పి । వానికలంకారభావంబుగా పెక్కు భర్మయూపంబులు పాదు కొల్పి । జలచరశతంబునొగిచతుశ్చరణశతము । పక్షిశతమునుముమ్మా రుసశువులూన్చి । తద్విశసనంబుపిదపద త్రడినడంచి । తరసములుదీసి బుత్విగ్వితానమపుడు॥

సీ॥ తత్తత్సుపర్వహితస్వాదుత్వైన యాహుతులుగానించుచో వతిగుణాఢ్య । యగుసుకేశినిచేతనర్థాంబులగుహుతంబులునల్ప జేసిమి గిలినయువయ । వ్రాత్కారంబులను యథోక్తహుతంబులు గావించియతా హారోమగంధలహరి । నాసికాసంతర్పణము జేసి తదనంతరమునన రుంధ తీకమలగంధి । రేడశేషసదస్యులకూడితార । నిర్వనాశీర్వచశ్శ్రేణినెర పియబభ్రు । ధావగాహనమునుతుదిసాంగసెంప । జేమునోష్పారియప్త హీనసాయెకుండు॥

శా॥ దీనారంబులుకోటికోటులఖి లర్థివ్రాతాళికర్పించిని । ర్ధీన
గ్రామకదంబకంబులు బుధశ్రేణుల్గ్రానంజేసిన । ర్వ్యేనగ్రామణులంనమా
దృతులతో నిద్ధాంబరాకల్పవంతానశ్రీ । నలరించినిమర్యాలగుణా తంద్రు
న్వశిష్టవ్రతిన్॥

గీ॥ కాంచితత్పదములు గడిగియానీరు త్త । మాంగసీమనిడుచు
మానవేంద్రు । డపుడు ధారవోసెనతనిక శేషగో । త్రాతలంబుభ క్తిత
రగ లె త్త॥

చ॥ పలికెనరుంధతీవిభుడు పార్థివపుగన్గొని రాజముఖ్యనీ । యల
ఘుభుజాగ్రపీఠిని పమగ్రసుఖోన్నతి నుండుకుంభిని । లలనకుశర్మసంపద
గలాదెభళీమదధీనమైనచి । కుల్లిడక గోమ్ముకోటిశతకోటి వరాలిడివా
ధిన్ మేఖలన్ ॥

గీ॥ తపసియడిగినట్టి ధనమునకిబ్బడి । నిమ్మకోటులొవగినీరజా
ప్త । వంశజుండువకల వసుమతీచక్రంబు । గొనియెనఖిలనృపతికులము
లెన్న॥

ఉ॥ పిమ్మటబానవాల్గొరల విశ్వనృపాలురమిత్రబంధులో। కమ్ము
లవీడుకొల్పిబలగమ్ములుదేశికుడున్ సమ స్తసై । న్యమ్ములువిప్రమంత్రిజన
దానకదంబము వెంటరాగవే । గమ్మునజేరెప్రోలురిపు ఘస్మరుడాయిల
శేడశోకుడై॥

మ॥ పరిదిద్వేష్టితవిశ్వధాత్రిస్వ భుజాచక్రంబునందుంచివా । వ
రరాజాన్వయుడామయాతిన్ విర సత్సామ్రపముఖ్యాపదుత్కర। శూన్యం
బుగ రాజ్యమేలుచునుపుత్రశ్రేణికానాకసా । ఖ్యరమంగూర్పదలంచిచే
సెతప మాకాశాపగాధ్యాసియై॥

క॥ త్రింశత్సహస్రవర్షము । లంశుమదన్వయుడు సగరుడమరన
దినిసి । స్సంశయముగ దేవనపాభ్రింశమతిందపము సేయఫలితముగామిన్॥

చ॥ వగచుచునింద్రుజేరె దరువాతనిలావలయాంబ శేషమా । స
గరనృపాలపౌత్రకుడు సాహసధుర్యుడు నీతిశాస్త్రపా । రగుడలయాంశు

మంతుడు విరాజిల జేసె భుజంబున నా కరా । గ్రగకరవాలధారరిపుకాండ
ము రాగ్రహపంకమూఢ్చుచున్ ॥

క॥ ధరనంశుమంతుడేలుచు । పరలోకసుఖము పితృవ్యవారము
వఱకు జే । కురజేయుదపమొనర్చెన్ । సురనిమ్నగనాత్మ నిడివిశుద్ధవ్రతుడై ॥

క॥ కపటేతరనియమంబున । జపమొడపక సేయుఫలమొనగద య్యో
జనా । ధిపుడిలముప్పదివేలేం । డ్లపరిమితనియా ప్తినేలియరిగెన్ దివికిన్ ॥

క॥ ధారాధరవాహనవర । ధారాధరచంద్రచంద్ర ధవళయశ
స్సం । చారాఖిలలోకుడుసువి । చారుండుదిలీపకుం డెసగు దత్సుతుడై ॥

మ॥ సురలోకచ్ఛలభూరిహర్మ్యమున కస్తోకోద్ధతిన్ శాత్రవా ।
త్కరమాత్రోగ్రకృపాణదంభఘన సుత్రామాశ్మనిశ్రేణికా। సరణిందా
రగధీరుడై పరిదధీశ ప్రావృషోర్వ్యధురా । ధరుడై గ్రాలెదిలీపుడంశు మద
నంతా కాంతజుండాదటన్ ॥

క॥ తాతయుతంత్రిడియుబలెగం । గాతటినింగూర్చితపమఖండవ్రి
తుడై । యాతడుపల్పుచుకడురో । గాతురుడయికీర్తిన్ కాయుడయ్యెన్ బి
దపన్ ॥

క॥ ఆరాజాగ్రణిసుతుడుభ । గీంధుడుసమగ్రశౌర్యకీర్తిన్ కళా ।
గోత్రారధుడుఫలితసూరిమ । నోరధుడతడేలెనిలజనులుగొనియాడన్ ॥

సీ॥ యేయనంతేశు మహాయశోధామంబు ధామంబుహరిదగ్రత
తినొనర్చు । నేక్షితీశ్వార్యహార్యకుస్వభావంబు భావంబురిపుగజా వళికిగ
లచు । నేతులేతరుదాన కౌతుకాకల్పంబు కల్పంబుకరణిమార్గణులమను
చు । నేభవ్యగుణుతనూశోభదాననయమ్ము వానిమానముపడంచు । నత
డున్వనిదేశవశితాఖిలాంతిరిప । భూపముకుటాగ్రదేశసంస్థాపితోరు। రత్న
దీపనికాయసీరాజనోజ్జ్వ । లాంఘ్రిపల్లవుడాదిలీపాత్మజుండు॥

ఉ॥ ఎల్లరుమెచ్చనాతడుమహీతలమేలుచునిట్లులెంచెదా।నుల్లము
నందుదేవనదినుర్వికిదేదపమాచరించుచున్ । జెల్లిరితాతలుంగురుడిసీకడ
ముట్టని కర్జమయ్యెహా । దొల్లిటిపుణ్యపాపవితతుల్మహిజీవులకేపుజూపవే॥

గీ॥ అసితలంచిగంగ నవనికి దేదపం । బాచరింతుననుచు నఖిలరా
జ్య । భరము మంత్రిజనులపై నిల్పి కదలెనే । హిమశిఖరికా భగీరథుండు॥

క॥ గ్రామంబులుపల్లెలు మున్ । ధామంబులుగోనలవనిధరములు
గటక్ । స్తోమంబులుగనుగొనుచున్ । భూమీశుసుతుహిమనగిరికి బోవగ
నొకచోన్॥

సీ॥ చటులపోత్రిఖరదంష్ట్రాదీర్ణ వేణుసంవత్తారచయ రంగవల్లి
కోటి । యాభీలవ్యాఘ్రకరాగ్ర భాగ్రపాటితకర్మ లక్ష్యసత్కుంభమాలం
కృతంబు । గర్వితద్విపోత్కట కలహసముద్భూత ఘీంకారవాద్య రవాంకి
తంబు । దర్పాంతచాళ సుప్తప్రాణిసద్గుర్వ ఘుటస్వనవాక్యగుంభితం
బు । ప్రకటసహకారతరుఫలగ్రాసమత్త । మారసాయమాలికాహరిత్తో
రణంబు । నగు మహారణ్యవేశ్మ నుల్లసపెద్ద । కానగని చొచ్చె జననాథు
కానకతన॥

స్రగ్ధర॥ కనియెన్ భూపాలవంశాగ్రణి స్వజనిత నక్షత్రలోకేశ్వ
రాలో । కనవాన్తోర్ధ్వమూర్ధాంచత్కలశ జలధిశంకాకరాపారనీహా ।
రనికాయాభోగశోభాప్రకరధవళితాభ్రప్రదేశున్సముద్ఘా । తనదద్దర్యగ్ర
జాగ్రస్థితని భరవాదారితాశున్ గిరీశున్॥

క॥ శృంగారములగు తద్గిరి । శృంగారములకతడెక్కి సితతుహి
నాళిన్ । రంగారుకటకపటలిన్ । రంగారయు మన్నేహారరతి జరియించెన్॥

సీ॥ కాయంబు బహువల్మీకములకగ్గగ గాధి కొడుకు తపంబు గై
కొన్న చోటు । ననిలాశికుండలుండద్ధమోగముకాత్త నృపతిజన్నమొనర్చి
నెగడుచోటు । సర్వమంగళపెండ్లి సమయంబులో ప్రమథానీకములు స
భ్యయైనచోటు । హరిమహిమంబు బుష్యగ్రణులకు నీడజాకీశ్వరుండు చెప్పి
నట్టిచోటు । పృథుమిజడథులు నాగ్గ్ము గెడసి ముచ్చు । నాడు మను పుష్ట
గాటంపు బోడజలచ । కేంద్రమహాప్యుతుడు దాల్చియుడినచోటు । గాం
చుచు భగీరథుడు మహాకాంతుడపుడు॥

క॥ ఆశైలంబెల్లసుధా । త్రీశుడు గ్రుమ్మరుచునొక్కయెడ గాంచె

తటీ । దేవద్రుమశాఖాక్రమి । తాళముపుజలప్రకాశనుముకొలనెదురన్ ॥

శా॥ తత్కాసారతటోర్వరాలయ మునీంద్రశ్రేణియాధారిణీ । భృత్కంఠీరవప్రజూచిమిటకు రానేలయ్యమీరాజ్యము । ద్యత్కళ్యాణ సమన్వితం బెహితభృత్యామాత్యవర్గంబునం । పత్కీలిందనరారు నేనృపులు గొల్వన్ వర్తు రేతప్పకన్ ॥

క॥ నాపినిభవదాశీర్వచ । నావిర్భవశుభముచే సుఖాయతినుంటిన్ । మా వారుక పిలదృక్క్ । లావచ్ఛిఖబడినవిధమిలన్ బ్రదితమెకా ॥

క॥ వారిబవిత్రుల జేయఁగ । వారిజహితకులుడుసగర భర్తన్ సురసదీ । వారింగోరితపంబని । వాంతగతి జేయుచున్ దివంబునకరిగెన్ ॥

చ॥ తపమొనరించుచున్ ద్రిదశధామము జేరిన మత్పితామహుం । డపగతదోషుడంశుమనులాధిపుడట్టుల గంగఁగూర్చి । నిష్కపటజపంబు జేసితుదిగానకకీర్తిశరీరుడయ్యెద । న్నృపసుతుడౌడలీపు డొనరించెను తాదృశయత్నంబుగన్ ॥

గీ॥ మద్గురుండానృపాలుడమ్మనుజవిభుడు । గెడసెరోగంబుచేత నీపుకమినాల్గు । చెరుగులకునన్ను భర్తగా జేసిరంద । రంతనన్నావరించెదురంతచింత ॥

ఉ॥ ఎయ్యదియంటి రేనివినుడీజనకుండు బితామహుండువె । న్దియ్యకతాతతాతమును దేవతరంగిణిగూర్చి కాయముల్ । డయ్యతపంబొనర్చినసఫలత్వముగాంచక వేల్పువీటికొయ్యెయ్య । న జేరిరక్కరతనూద్భవిచింతగదాప్రవతిన్ లెన్ ॥

క॥ ఆచింతదీరనియతిన్ । ఖేచరనదిగూర్చి తపమొగిం జేసిధరి । త్రీచక్రమునకు దెత్తు । సుధీచక్రములారతద్విధిన్ దెల్పుడికన్ ॥

గీ॥ అనినకార్యసిద్ధిరస్తు తేయనుచునా । శీర్వదించిమునులు సెలవొసంగ । సౌరనదినిగూర్చి జపమొనర్పగడంగె । [illegible] భగీరథుండు ॥

శా॥ అంగన్యాసముఖాన్వితంబుగ పితా నాంధో [illegible] మంత్రము ।

త్తుంగప్రీతినిముష్వశిష్టముని వాధున్వేడిహృద్వ్యాధి । దాల్చెంగానన్మరికొన్నితద్విధులు జాళిందాపసుడెప్పు । మాతంగారిద్రవిణుండు రేడెరిగ శుద్ధశ్రీమనోజ్ఞాతుడై॥

సీ॥ ఆరాజు భూరినీహారాతిశైత్య సంభారంబులకు బ్రకంపంబుగొనక । నాయినుండుష్ణకాలాభీలతరతాప ఘట్టంబులకుబిట్టు తల్లడిలక । నాజిష్ణుడలఘుతోయధరధారానికాయములకు డెందమందళుకుగొనక । నాథరాధీశ్వరుండధికోగ్రవాత వేగములకు చలనంబుగమరనీక । నానరేంద్రుండుదుమ్మదాహీనపటలి। కడలకనివారణసీమయందునిలిచి। గంగ గూర్చితపమునల్పకాయలాకు । గములుమూలంబులశనంబుగావిధించి॥

ఉ॥ హాయనముల్ సహస్రదశకాభిదసంఖ్యగనూర్ధ్వబాహుడై। యాయనఘుండుసల్పితుది నభ్యవహారముమానిస్వనాదికన్ । బాయని ప్రేమతోహృదయపద్మమునిందిడి మానిరాజులా । రాయన జేసెదుర్భరతరంపునపంబొక యేడుదగ్రతన్॥

శా॥ అంతన్నాపరిగ్రమ్మెనద్దెసలఘోరాశన్యనీకంబుల । త్యంతోదగ్రతప్రాలెనెల్లెడల నూర్ధ్వాండప్రదేశంబునన్ । ధ్వాంతశ్రేణులునిండెనుప్పతిలెనాదంబభ్రసీమన్ భయా। క్రాంతంబయ్యెజగత్కదంబమురిలెన్ కాష్ఠావళుల్ప్రల్లుగన్॥

శా॥ ఆయుత్పాతములంగనుంగొనిసుధాహారుల్సుధీరక్షణో। పాయుందోయజజేరిఘోరతపమున్జాతాన్వవాయుండు దా। జేయంజొచ్చెదుపారశైలమునవిస్మీమోద్ధతిన్ దానిచే । వీయుర్వీస్థలికయ్యెగీమునుపవేయిద్ధానుకంపామతీ॥

క॥ అనిసశతానందుండి । ట్లనియెన్ సురలారగంగనవనికిదేఁబూనినవాఁడు భగీరథుడా । యనకుంబాడనూపునిజన్ రాపగకరుణన్॥

గీ॥ తనువులేదింక నిడుము లెక్కడివిజనుడు । తావకాగారముల కన్న చేవతాళు । లరిగిరాత్మాలయంబులకాభగీర । థుండొనర్చుచునుండెనఖండతపము॥

క॥ నేకశ్రీకనభస్స్వ | త్సాకావళితోడగంగ ప్రత్యక్షంబై | యా కాశంబునవెల్సెన్ | రాకాశశిబింబవిస్ఫురత్ప్రభలొలయన్॥

సీ॥ ప్రకటోర్మికావళీ వళులతోనున్నమత్ప్రథితసైకతనితంబములతోడ | లాలితశైవాలవాలబంధముతో విలోలేక్షణపుగండుమీలతోడ | విలసితాంబుజకోశవృత్తస్తనములతో రమ్యారవిందవక్త్రంబుతోడ | పృథుతరావర్తనాభీవివరంబుతో సమదకూర్మప్రపదములతోడ | హంసకరవంబులొలయననంతవీధి | యందుసాక్షాత్కరించిహర్యంఘ్రిజాత | బలికెవ్వతరంగఘట్టనప్రభవనాద | మేదురగభీరసూక్తిభూమివిభుగాంచి॥

గీ॥ తపముజాలుఁ జెమ్ముధరణీమహేంద్రభ | వన్మనోరథంబ వార్యకరుణ | సఫలముగనొనర్పఁజనుదెంచితినినీదు | చెంగటికిననంగగంగఁగాంచి॥

క॥ గంగేమంగళకారిణి | రంగేకర్పూరదరమరాళనిభవిభా | సంగేభక్తజనైనో | భంగేమాంపాహియనుచుఁ బ్రణుతియొనర్చెన్॥

క॥ హరిజేరామేయాజా | వరజేవిభ్రాజితప్రభావజితమహా | విరజేజనకితహరిపద | శరజేమాంపాహియనుచుసన్నుతిజేసెన్॥

క॥ ఈకరణిఁబల్కిగ్రమ్మర | నాకధునిన్ బొగడెవాసరాంతసటద్ద ర్వీకరకటకనిషంగమ | హాకల్లోలౌఘకర్షణాత్యార్భటులన్॥

సీ॥ సద్బ్రహ్మపదమ్మృషాసౌధంబునకుత్వదూర్మిశ్రేణి నిశ్రేణిమి న్నువాక | నైర్ధనకాఘుచ్ఛలోద్యన్మృగంబులకు నీకాండంబు కాండం బుకలుషదమని | తాపత్రయాద్రిబృందములకునీఝరీశతధారశతధార శౌరిపుత్రి | తీరధరాభాగధీరపత్రికినీదు సేకంబశోకంబనాకులాత్మ | కేవల చ్ఛాయలిమనీతటీవనములు | పావనములుగదమ్మగీర్వాణవంద్య | నీప్ర భావంబువర్ణింపనేర్పునాకు | గలదెనాతల్లిసకలాఘగామతల్లి॥

ఉ॥ తమ్ములకెల్లగీర్తులుహితమ్ములుగానిడిభూరిశైత్యజాతమ్ములు మారుతమ్ములకు దార్కొనజేసిసుజీవనంపు | మొత్తమ్ములసత్కపీంద్రుల ను దన్పుచుభాసిలుచున్ననీను | వృత్తమ్ములుదల్పగానభిమతమ్ములు జేకు రవేబుధాళికిన్ ॥

ఉ॥ మా ప్రపితామహుల్ కపిలమౌనిదృగంతరవీతిహోత్రహే ।
తి ప్రకర ప్రచండనిహతిన్ బడిరప్పెను బూదికుప్పలన్ । తత్ప్రగతిన్ భవల్ల
హరి జేర్చి పవిత్రుల జేయనమ్మ భ । ద్రప్రదనిమ్నగాతిలక దా నమరుర్వ్యను
ధాజవల్లికా॥

క॥ నావిని యిట్లని యెజగ । త్పావనిసుర శైవలిని నృపాలతిలక నే।
దేవపథంబున నండిమ । హిమవలయము మీద బడిన నెడురువ్రేసము దే॥

ఉ॥ ఆవిధ మెట్లులన్న వినుమంబరవీధిని ల్చిడిగ్గమ । జీవనధార
పోకి జగతీవలయంబు ఖలంబునుగ్గును। గ్గయి వికలంబునొంద దెలయంబులు
గా వెజగత్కదంబముల్ । గావున నాశ్రయింపుము హరంకణు నన్నుభరింప
నో నృపా॥

క॥ అనిమిష నది యిటులనుడివిచ । నినపిదప భగీరథావనీవిభుడుము
ధావను దహనాలోకను పా। వనునార్యాహృదయభవను భావాబ్జమునన్॥

చ॥ నిలిపిన రేంద్రుడే డొకటినిష్ఠ మొయిన్ సకలేంద్రియాళి నం। చ
లనము వాపి మానస వశంబుగ దాఁచి తదన్య నంబనా । విలగతి నీశునందు
నిచి వీడక చేసె తపంబు దానన । గ్గల పుటనుగ్రహంబొదవి గాదిలితోన్నృ
పమాళిముంగలన్।

సీ॥ కాళ్కితోన్నృప రాజపాళితో శశిబద్ధమాళితో దిక్చ్యాలకాళితో
డ । నందితో జేజేలమందితో గానకమణందితో జిల్వరాయందెతోడ। మొక
ముతో గణాకదంబకముతో సత్వగం శుకముతో నుషఃపథాలకముతోడ।
ధాత్రతో నిందిరా నేతతో గ్రాంచ జిద్ద్వాభతో సెకకంటి మూతతోడ।
భూతితో సర్వ కారుణ్యభూతితోడ। వ్రతాలతో నప్సరో వధూతతులతో
డ। హితులతో భైరవాది కాశ్రితులతోడ। సరసమిగురా త్రిశివుడు సా
క్షాత్కరించె॥

గీ॥ ఇట్లు ప్రత్యక్షమయిన గౌరీశు గాంచి। శరధికాంచీతలస్వామి
పరసభక్తి । చేనమస్కారములు పెక్కు జేసినమక । చమకసూక్తుల
తో నుతుల్సల్పెపల్కె ॥

దండకము॥ శ్రీమన్మహాదేవ దేవాగ బాణాసబాణాదికత్రాణ
పాణీకృతాపర్ణ పర్ణాశిభావాంబురుట్కర్ణికాగార గీరాశ్వసంహారపా
రందరేభాబ్జకర్పూర శేషోరగోద్యత్ప్రభాపూరధిక్కారి శోభాంగమా
తంగ రక్షోంధకోగ్రాంధ కారార్కదర్వీకరాకల్ప కల్పాంతవేళా కరా
గ్రేద్ధ ధక్కాధమత్కార నిర్హ్రాదభిన్నాఖిలాండాండ తద్వాద్య గర్భప్ర
ణిర్యాత పచ్ఛబ్దశాస్త్రాది సూత్రౌఘపూర్ద్దానవ ప్రాణవాతూల వాతం
ధయాధీశ హాలాహలస్ఫూర్తి కంఠాజిరస్థాన భానూడుపాగ్న్యక్ష య
క్షాదిరాణ్మిత్ర సుత్రామముఖ్యాజరస్తోమ సంస్తూయమానాంఘ్రి పంకే
రుహద్వంద్వ వందారుమందారనీవద్వితీయామబ్రహ్మవైయుండి తర్వాత
సంశుద్ధసత్వప్రధానైక మాయాగతిన్ దివ్యసాకారవేషన్ ప్రవర్తించి
రుద్రాద్యుతాంభోజ గర్భాకృతుల్దాల్చి విశ్వక్రియాధార సంశోభివై
యున్న యోయన్న నిన్నెన్న నేనెంతవాఁడన్ విధీంద్రాది బృందారకు
ల్జాలరజ్ఞాట మచ్ఛక్తిమాత్రంబు గాఁగోల్తు మన్నింపవే కంధరప్రోత దు
ర్వారపాశాయుధాకృష్టమున్వర్భకాతిన్ స్వనాథార్థాచ్ఛ లింగోదరావిర్భ
వీభూత సూపాంఘ్రి నిర్ఘాతపాత ప్రభగ్నాంతకోరః కవాటాసృపీటా
శుగాకార భూవహుల్ దోల్తగల్పించి యామీద సర్వంబునుం జేసి
పోషించి మాయించి జెన్నారు నిన్నెన్నన్ బాల్తునోయయ్య త్రయ్యం
త విద్యామిషాదర్శ సందర్శితాకార మాలూరపత్రంబు నీమౌళినర్పించు
వారెన్నఁడాలింపరా భీలకాలాశ్వకంఠోపకంఠ స్ఫురద్ఘంటికారావమో
దేప సంసారవారాకరం బీదఁగాలేని యీబీదకెట్లోడవైయొడ్డు వట్టింతు
వో దిక్కు నీవంటి నావంటి దీనావళిం బ్రోచు భారంబు నీదేకదా శోకదా
వోరు జీమూత జీమూతజాధీశ ధీశాలిసంతాన సంతానసంసచ్ఛభాధీన
సమ్యక్కృపాలీల యారక్షమాం రక్షమాం రక్షమాం ॥

చ॥ చలమున తండ్రితాతలొక సంయుమిపైజనితత్కఠోర దృ ।
గ్జ్వలన శిఖాహతింగుమిలి కాలి వసుంధరబూదకుప్పలై । నిలిచిరివాని
ముంప సురనిమ్నగ వేడగదోఁచి మజ్జు । జ్వలతిరధారకోప దురసావల
యొంబ్లని పల్కియిట్లనెన్ ॥

క॥ పైనుండిధరకుడిగుమ। తాపసియాభీలరయముభరియింపగనీ। శానుడుదక్క తదన్యుడు। గానగరాడనిన నిన్నుగంటి పశుపతీ॥

చ॥ అనిపలుమారు మ్రొక్కిన నృపాగ్రణిగన్గొని ఫాలలోచనుం। డనిమొదలంధరింతు సజరాపగ దెస్సు భవత్తపంబునా। మనము గరంగ జేసె బుధమాన్యులు ధన్యులు సద్వ్రతాన్యుల। త్యనఘులు పుత్రకుల్వ్వాడమునట్లుగ నీకు వరంబొసంగితిన్॥

క॥ అనవుడుహర్షించిదిలీ। పనృపాలసుతుండుగంగ బ్రార్థింప గవ। చ్చెనఖండపాండుడిండీ। రని కాయము మింట శశికరచ్ఛటనీనన్॥

శా॥ తారామండల మంతరిక్షము జగద్వారంబు వ్రీలన్ మహో। గ్రారావం బొనరించుచున్ కులమహీ ధ్రౌఘంబులో ధాత్రితో। గౌరీశుంగొని భోగిలోకమున కేంబోవుమాడ్కిన్ ఘన। ద్వారం బెల్లను దానయై యఖిలజీవవ్రాతముల్ భీతిలన్॥

కం॥ ఏతెంచుసురాపగగ। ర్వాతిశయంబడప పుష్కరాలకుడగ జా। నేతకపర్దము బెంచెన్। ఖ్యాతిగ దేవనదిదత్కుహరమున బడియెన్॥

చ॥ పడివెడలంగలేక వృషవాహకపర్దము నందడంగన। య్యెడయడుగాంచియచ్చెరువు నొందిజగంబులు మ్రింగవచ్చునై। వడిచదలెల్లనిండి సురవాహిని తిట్టినయట్లు మాయమై। పొదవడగెన్గటాయను చు భూతపతిన్ భజియించె గ్రమ్మరన్॥

గీ॥ ఆభగీరథుభక్తికయ్యాభవుడాద। రమున సాక్షాత్కరించి విరాజమాన। నిజజటాజూట మొక్కింత నేలకొరుగ। జేయగాడిగ్గె గీర్వాణసింధువిలకు॥

శా॥ ఆలోకంబహిలోక సీమనిడి దివ్యాలోకన శ్రీలచే। నాలేఖాపగకార్యమింగని మదిన్ హర్షించి నిన్నొంచురా। ట్పాళిన్ సద్గతి కన్న వచ్చితిని నాపైనల్లవద్దంచుదా। గేలోలిన్ముకుళించెనా నెసగునక్షీణాబ్జకోశాళితోన్॥

సీ॥ కపిలునికిన్కక్కడికి బోవెరపూని సుడివడుచుందాన సుడు

లుగ్రాల। సాగరదోః సము ల్పనదోచుకరముల కరణిచెన్నగు తరంగము
లుసెలగ। నెండద్యోనదికి రాకుండబట్టిన గొడుగులునాజదల హంస
కులము లెసగ। ధునిలోసల భగీరధుసకీర్తులూరి భాసిలెనాగఫీనముల్ద
ళుకులీన। వచ్చెమిన్నేరు మేమేడజూచ్చియుండు। మనియఘుంబులు
మొరజెట్టెనభవుగూర్చి। యనగపంకజములనుండి యళులులేచి। భోరన
మహాబిలముడాసి మోతలిడగ॥

చ॥ ముహురుదితోగ్ర ఘోషణ సమూహము లాకసమంటరో
దసీ। కుహరముగ్రీలబెల్లు బికిగొబ్బున బారి సరోంతరంబులన్। లహరుల
నింపి సప్తగతుల స్రవహించె బల ర్యజేందిరే। శహరముఖాధ్వరాశను
లు సంస్తుతులంబర వీధిసల్పగన్॥

గీ॥ నిరఘులగుచు పావనీహ్లాదినీనలి। నీసమాహ్వయముల నెగ
డుమూడు। వాకలేగె తూర్పువై పునకుమిన్కా। డోలలందుహంసపా
ళులూగ॥

క॥ సీతసుచక్షువుసింధువు। లాతతగతినేగె పశ్చిమాశకుమూడు।
ర్వీతల తైర్థికవృజన। వ్రాతాగశ తారలై ప్రబలుధారలతోన్॥

క॥ అనప్తాపగలందు విభాసిలునొక వాకవెడలి వచ్చెదిలీప। క్ష్మా
సుత్రామాత్మజుతో। భాసురవిశదప్రవాహ వైభవయుగుచున్॥

సీ॥ దివికేగదివ్యుర తైర్థికుల కెసంగునిచ్చెనలు నాభూరివీచిక
లుగ్రాల। ద్రిప్పెదునిట్లఘుశ్రేణులనెల్ల నన్కరణినావతన్సంఘాతమను
ర। తారలతోజె ర్మి దనరింపజనురీతి ఖతలంబునకుపయఃకణము లెగయ।
నార్యకీర్తులకు దీకైపరాపగలనవ్వెసమాడ్కి డిండీర వితతి వెలయ।
పృథివిపెంపెల్ల వీక్షింతు పెక్కుకనుక। నన్నచందాన మీనచయంబు
లొప్ప। నమితవారిచరములు జెల్వారవచ్చె। నాకతటినీతిలకము భూ
లోకమునకు॥

ఉ॥ అంతశతార్కమై యమరునట్టుల కాంతిమదచ్ఛరత్నసం
క్రాంతకలాపజాల రుచిరప్రభలాకస మెల్లనిండగా। దంతివిమానముఖ్య

ముల దాలిచివచ్చిరి వేగనప్సరః। సంతతితో మరుత్ఖచర సాధ్యవసుప్రముఖాళితోసురల్॥

సీ॥ స్వవిమానబద్ధహంసగరున్నికాయంబు నింగిపైవంచువెన్నెలలుగాయ। పార్శ్వంబులనునవ బ్రహ్మలేతెంచుచు నవకల్పవిధానంబులడుగ। నమలోపనిషదర్వి తామ్నాయములునాల్గు పురుషాకృతులబూని ముందునడువ। నలఘుసప్తవ్యాహృతులతోడ గాయత్రిసుతిమాతడాసి సంస్తుతులొనర్ప। స్ఫటికపాంచాలి కాంతికపద్మరాగ। రత్నచిత్రంబుకరణిగీర్వాణుతోడ। వచ్చెపరమేష్టి నిర్జరాపగనుజూడ। నజరపాదులగేలోడ్పులందుకొనుచు॥

ఉ॥ అందరు నిర్జరాదులు సురాపగలోన గృతావగాహులై। వందనముల్ ఘటింపుచు జపంబులుచేసిరి మున్నియప్సరో। బృందములాడెంతట మునీంద్రులు స్నానములాచరించియా। నందముమీరగా సుమగణంబుల బూజలొనర్చి రెంతయున్॥

శా॥ ఆపుణ్యాపగలోన మున్నికలుషవ్యాపారులుంశాపపం। తాపుల్ నాకముజేరుచుండ సురగంధర్వాప్సరోయక్షకా। ష్ఠాపుల్ దానవదైత్యరాక్షసులు భాస్వద్వంశజస్యందనం। బేపారం జనుచోవడెందవిలి రిద్ధేష్టప్రకామ్యార్థులై॥

క॥ లహరీజలరయవిదళిత। బహులాహార్యాఘుయాగుచు బరతెంచితపో। వహుడగు జహ్నుసయధ్వర। మహిముంచెన్నోతతో సమరథునిసరణిన్॥

సీ॥ సారధవిత్రచపాలారణిశ్రేణి తరగలపై దేలివరదబట్టి। పరమాన్నప్పుషదాజ్య చరువులతో జప్లు ఝరిచంద్రకితములై పరనసాగె। ప్రాగ్వంశముఖయాగ భవనోత్కరచ్ఛాదనములు వేణువులుదూరముగ జరిగె। సామాజికత్రిజ్ఞచయమెల్లచేమీగాతిచే రోధమునకువచ్చెదలంకి। యురుతరపువెల్లి బోనోడియుడ్డుగుడుచు। చుంచుగొందర నీతగాంద్రుడుపనీతుల। నొడ్డుజేరిచి రంత జహ్నుండుగనలి। కటతటంబుల దరగదా

గంగననియె॥

చ॥ క్రతుపురుషాంఘ్రిపద్మమునగల్గితివధ్వర భుక్పురాంతిక। క్షితివసియించితీవు గుణశీలవటంచెద నమ్మియుంటి। దుర్మతివగుచున్ గలంచితివి మామఘమద్దిర పంకకారిణుల్। తతజడవర్తనల్ గుటిల తారత లెక్కుదరే సమున్నతిన్॥

సీ॥ వక్రంపునడవడి వదలకప్పృథుకీర్తి నడుగుబట్టించిన గడుసుతనము। బలుగాలిసోకి బొబ్బలువెట్టుచును మేరమాలివర్తించు గయ్యాళితనము। గడుతక్కువలకు చక్కగసాగి యున్నతస్థలులకెక్కగ లేని చౌకదనము। మించియొడ్లకుగాసి నించిబిట్టుగగురుతరుల గీటడగించు దగరతనము। ధీవరులకు విసారాళి తేగమిచ్చు। నట్టిటక్కరితనము డాయంగవచ్చు। వారిపైవిషములుజిల్క పలుచతనము। గన్ననినులోకపావనివన్నగరె॥

చ॥ పొరిబొరిసీరువట్టి కడుబుగ్గలుబెంచి కరంబురాగవై। యరచుచుభంగపాళులు రయంబుననొడ్లకు రాగజేసియ। ద్దిరభువనంబులన్ సుడుల ద్రిప్పితినంచును ద్రుళ్ళబోకుని। ష్ఠురగతి నీదుజీవనము సున్నగజేయక మాననేర్తునే॥

క॥ అనివదనముబెంచిఘనా। ఘనగర్జానినదమున జగత్పావనియా। ధునిగ్రోలికడలిగొన్నబు। ధుని బోలివెలింగెరోషధూర్వహామతియై॥

చ॥ అదిగని యాభగీరథ జనాధిపచంద్రుడు జహ్నుమౌనికిన్। పదములభక్తిమ్రొక్కులిడి సారతరోక్తుల బల్కెసాగరుల్। మదమున కార్దమిందవిలి మ్రందిరి సాధులనేచువారికె। ట్లొదవుశుభంబు లిప్పుడు బహుశ్రమకోరిచి గంగదెచ్చితిన్॥

క॥ నాథుఃరఘురమున్నశివా। నాథువితల జిక్కినట్లైనసెనిచ్చెటనా। నాథునికావనదైన్యన। నాథునినను బ్రోవుముజరనదినివిడిక్రుపన్॥

గీ॥ అయ్యో శతసహస్రహాయనంబులుసాగ। రాళిగెడసినేటికము

లచరిత । యొదవ దక్కటాతిలోదకదానంబు । వారలెంతపాప కారు లొక్కొ ॥

సీ॥ పేరుమాసెగడయ్యె పృథులహారులుతావ కాంబకేంధానకీలాళిదవిలి । పొడవడంగెనుబిట్టు భూర్యూర్మికలుభవచ్చటులరోపానలోష్ణక్రమమున । కడలంటెపుండరీకములెల్ల యుష్మదుద్గాఢతరోచ్ఛ్వాసఘట్టనమున । నుడిగిపోయెనుకంకణోత్కరంబులుత్వత్తపస్స్ఫారదుర్దాంతభానుతతుల । చదలారసివచ్చుమిన్నేటిజలములెల్ల । నిలువబడిద్రావినూర్చుంటివలవులేక । బాపు రేసీమహిమలెంచ పాపరేడు । చాలునేదూరితగ్లానిజహ్నుమౌని ॥

క॥ అనియంశుమన్నృపాలకు । మనుమడువినుతింపసుర సమాజముతోడై । మునివిభుగీర్తించిరికను । లెనిమిదిగలవేల్పుపిదప నిట్లని పల్కెన్ ॥

చ॥ క్రతుఫలమిచ్చినాడ మునిరాజవహింపుము శాంతి తేవతా । శతములకెల్లప్రీతిగరసన్విడుమయ్య సురాపగన్ । భవత్సుతయగుచుంబ్రకాశిలుకుతూహల మూనుముమానుమల్కడు । వ్నుతితులనేనిబ్రోచు దెలివాకనునీవరికట్టుటొప్పునే ॥

క॥ నావినిమునికేల్మోగిచిన । తావననినుగంటిమంటెనమర జ్యేష్ఠున్ । బావనునీయాజ్ఞసరి । జీవనమిక లిడువబూనితినియనియంతన్ ॥

ఉ॥ వెంగిలిగాదెనోట విడవేలుపువాకకబంధమంచుదా । గంగనువీడెజహ్నుముని కర్ణసురంగము పెద్దజేసిగో । త్రంగమకించిదూనుతరిరాజిలెదజ్జలధారమౌనికీర్త్యంగన గొండ్లిలోనభినయస్థితిజూచిన బాహువ్రేయనన్ ॥

మ॥ మునినాడింథముదుర్వరాసతికిసొమ్ములేస్ఁయశబ్దగ్రహం । బను కష్మచ్చునవెండికమ్మియిడి దూయన్ దీవమైబొల్చుచా । యనుగంగాజలధారభవ్యసితవర్ణాధారమైభూతలం । బునకుండిగ్గి భగీరథుంగదిసెవిస్ఫూర్జత్తరంగార్భటుల్ ॥

ఉ॥ క్షోణిపు వెంటదోయనిధిజొచ్చి రసాతలసీమబాకిగీ। ర్వాణతరంగిణీమణి జవంబున సాగరభూతివేదికా। శ్రేణులముంచిపారె పరసీజహితాన్వయుగాంచియంతవా। ప్రాణవిభుండుబల్కె పృథుగాంగతరంగఘుమంఘుమార్భటుల్॥

గీ॥ పొసగునెందాక సర్వలోకముఖములబ్ధి। నంతపర్యంతమాదితేయాలయంబు। బాయరాసాగరులు గ్రాలునీయశంబు। ధాత్రిమిన్నేరసంగునందాక వత్స॥

ఉ॥ దివ్యవిభూషణంబులను దివ్యదుకూలకలాపకంబులన్। దివ్యలతాంతమాలికల దివ్యసుగంధములంధరించియా। దివ్యులపీటసాగరులు దేలుదురక్షయభోగముల్ భవ। ద్దివ్యతపోవిభూతి పితృదేవగణంబునకీదె సౌఖ్యముల్॥

ఉ॥ తాతయుతాతతాతమరితండ్రియు దాలిచిపూనిన్ సేయలే। కీతటినీవ్రతంబు దివికేగిరిదీనిఫలింపజేసివి। ఖ్యాతివహించినాడవుగదయ్య దదభ్రతరంగిణీప్రభా। వ్రాతసదృగ్యశోనటుకిరంగములాశలుగాగ గ్రాలుమీ॥

శా॥ మూలస్తంభమవై తిధర్మములకీపుణ్యోదకశ్రేణిచే। జాలన్ స్నానవిధానముల్ సలిపి యశ్రాంతంబభీష్టార్థరిం। ఛోళిన్ గైకొను మీశ్వరాచ్యుతపదాస్తోకార్చనాద్యుత్సవ। శ్రీలన్ దేలుము నేలయేలుము ధనాఢ్యప్రాణులం బ్రోవుమీ॥

శా॥ కాకుత్స్థాన్వయకంజభానులుకళా కాకోదరేశుల్ కృపా। లోకుల్ నీకుదయింతురాత్మజులు సుశ్లోకుండవై యుండుమో। పాకారాతిసదృక్షభోగయని యాపద్మాసనుండేగె భా। సాకాంతాయుతుడై స్వలోకమున కాస్థన్ దేవతాపాళితోన్॥

ఉ॥ ఆదటగంగలో మునిగి యర్వాదివేపురకా భగీరథ। క్ష్మాదయితుండు సల్పిన ప్రశస్తతిలోదకదానలీలచే। పాదుగవారుదివ్య తనుభాసితులైనిజనప్తకంచితా। శ్రీదనరారదీవనలుసేయుచు నాకముజేరిరున్నతిన్॥

ఉ॥ ఉన్నతదివ్యలోకముల కొప్పుగ సాగరకోటి జేరవి। ద్వన్నికరంబులంబిలిచి తద్వసుధావిభుడిచ్చె దానముల్ । పన్నుగ నగ్రహారముల భర్మకలాపములన్ మణుల్వరా। లన్నము బెట్టి సర్వసుజనాళికి సద్రవసంయుతంబుగన్ ॥

ఉ॥ పిమ్మటనా భగీరథుడు పేరిమినూర నయోధ్య జేరిచు। ట్టమ్ము మిత్రపాళులు భటచ్ఛటలుం సచివుల్ గళాఢ్యవా। గ్గ్మ్ములు సంతసింపరి పురాజకదంబము ఘోరశైలదు। ర్గమ్ములనాశ్రయింపగ ధరాతలమేలె గృపాణపాణియై॥

శా॥ శక్రాద్యష్టదిగీశ్వరుల్ బొగడనిస్సాణానకధ్వానమా। శాక్రోడంబులు వ్రీలజేయగ చమూచక్రార్భటుల్ రేగివా। ద్విక్రూరాన్వనపాళి క్రుంగజని వైరిక్ష్మాపులం గెల్చిని। ర్వక్రప్రీతి దురంగమేధములు గోత్రం జేసె రేడావలన్॥

సీ॥ ఆభగీరథుడు దానశ్వమేధంబులు సేయుచో వేద్వేర వేయివేలు। తేరులకన్నెల నారూఢిగా నలంకారంబుగావించి గారవమున। నరదంబులకు నూరు కరులకరికి సహస్రతురంగములను దురంగమునకు। గోపరంపర నట్లు బాపింపగా జేసి భూరిభూరియుతంబుగా రహించి। దానములు మహీసురాళికముఁ లకిచ్చి। యంతరీపవిలతతులన్ని పొగడ। నెగడుచును శ్రుతాద్యనేకాత్మజుల గాంచి। పాలనంబు జేసె నేలయెల్ల॥

మ॥ వృజినఘ్నంబగు నీకథన్ జదివినన్ విన్నన్ వరాయుర్ఘ్రకం। డజులై శ్రీధనధాన్యకీర్తియుతులైనం దీభవత్సర్వనా। కజులై యుండుటె గాక పైతృపితృసంఘాతంబుల శ్రాంత సౌఖ్యజగద్వాసులుగా గలారుపృథుభోగప్రోజ్జ్వలాకారులై॥

క॥ కార్యంబులెల్లనగునఘ। లార్యులచే నుతులుగాంతు రాముష్మికపుం। జర్యసుఖంతో రుదుద మునివల్యావళులార యీనృపతికథ విన్నన్॥

మ॥ కరసంభాసిదరారివత్స ముఖరత్నశ్రేణుల జంభారినిష్ఠురదారిద్ర్యథవాభ్రభవారినియమిస్తోమాత్మసంచారిమం। ధరగోవర్ధనధారిపూ

ర్ణతరసంధాకారివేదాంతపం। జరశారగుడిపూడి శౌరిగుణవిస్తారానుచా
రీహారి ॥

క॥ సారస్యమంతతస్కర। దూరమహైనఃకుభృద్భిదురశితధా
రా। వారసుధాంధోరత్నా। ధారనిజశ్లోకమిళిత బహులాశార ॥

తోటకము॥ నరకాసురకాయవినాశనధ। ర్మరతానిరతామరరా
జసమా। దరణాశరణాగతకల్పకస। త్కరుణావరుణాలయకమ్రగుణా॥

గద్య॥ ఇదిశ్రీమన్మేధా దక్షిణామూర్త్యష్టమూర్తిః దా
క్షిణ్యాసులబ్ధ కవితాసార సుభద్రాంబికా పిచ్చ
యామాత్య కుమారతురగాన్వయపయ
స్సాగరాభోగ తారాజార వేంకటక
విధేయప్రణీతంబైన నిర్వచన భగీర
థోపాఖ్యానంబను మహాప్ర
బంధంబునందు చతుర్థా
శ్వాసము సంపూర్ణ
ము.

